# అబ్బూరి వరద రాజేశ్వరరావు

# కవితాసంచిక

సంకలనం

ప్రభాకర్ పరకాల, ఎం.ఏ.పిహెచ్.డి.(లండన్)

విశాలా గ్రంథశాల

# KAVITASANCHIKA
## Collected Poems

Abburi Varada Rajeswara Rau

తొలి ప్రచురణ : 1993



ప్రతులకు :
నవోదయ పబ్లిషర్సు
విజయవాడ

వెల : రూ. 30

ముద్రణ :
ప్లానోగ్రాఫర్స్,
చిరాగ్ అలీ లేన్, హైదరాబాదు - 1

# పరిచయం

ఈ సంకలనంలో, 'చెరకాలం' అనే సమగ్రకావ్యానికి చెందిన కవితాశకలాలూ, వివిధ పత్రికల్లో అచ్చయినవీ లభ్యమయినవీ అయిన వరదరాజేశ్వరరావుగారి కవితలూ చేర్చాను.

నాలుగున్నర దశాబ్దాల క్రితం శ్రీ వరదరాజేశ్వరరావు 'చెరకాలం' రాశారు. అందులోకొన్ని ఖండికలు అప్పటి 'తెలుగు స్వతంత్ర'లోవెలువడినాయి. ఆ తరవాత 'అందాక' అనే పుస్తకరూపంలో వచ్చినాయి. అనతికాలంలోనే మూడు ముద్రణలుపొంది తరవాత అలభ్యమయిపోయింది. 'చెరకాలం' వ్రాతప్రతిని దురదృష్టవశాత్తూ వరదరాజేశ్వరరావు పోగొట్టుకున్నారు. ఆ కథ ఆయన మాటల్లోనే యీసంకలనం చివర చదవగలరు. ఈ నాలుగోముద్రణలో 'చెరకాలం' కావ్యంలోని మరికొన్ని ఖండికలను – యింతవరకూ అముద్రితాలు – ఆయన వ్రాతపుస్తకాల నుంచి దొరికినంత వరకు యేరి చేర్చాను. ఇవన్నీ 1948వ సంవత్సరానికి చెందినవి.

తతిమ్మావి మిత్రుల సహాయంతో సేకరించినవి. ఆయన పదకొండేళ్ల వయస్సులో రాసిన పద్యాన్ని ముందుగావేసి తరవాతవి కాలక్రమానుగతంగా ఉంచాను. అంతకన్నా చిన్నతనంలో అచ్చయిన ఆయన పద్యాలు లభ్యంకాలేదు. ఈ సంకలనం కేవలం స్వయంకృత ప్రయత్నం.

కవిత్వం మీదా, సాహిత్యం మీదా ఆయన వెల్లడించిన అభిప్రాయాలను పుస్తకంచివర చేర్చాను.

ఈ సంకలనంలో తోడ్పడిన మిత్రులు చలసానిప్రసాదు, అత్తలూరి నరసింహారావు, అబ్బూరి గోపాలకృష్ణ, ఏల్చూరి మురళీధరరావు, సమ్మెట నాగమల్లేశ్వరరావు, సతీష్‌బాబు, శ్రీశైల్ రెడ్డిలకు కృతజ్ఞుణ్ణి.

హైదరాబాదు — ప్రభాకర్ పరకాల

**10-10-1992**

# కవితా సూచిక



నీ వ్రాసిన చెరకాలం
తీవ్రంగా చదువ చదువ తెరలెను పరదా
నీవ్రయ్యలైన హృదయపు
చేవ్రాలే కావ్యమై రసించెను వరదా!

చెరకాలపు చిరధారుణ
మరణారుణ చరమకేక మనకో సరదా
దురితాలతో ద్రవించిన
విరబాధే కావ్యమై హసించెను వరదా!

అల వైజాగున మన ఆ
టలు మన పాటలు జ్వలించడం అది సరిదా
కలకాలం చెరకాలం
సిలువై తుదికావ్యమై స్పృశించెను వరదా!

శ్రీమాన్ మీ ఫాదరు నా
కోమాదిరి నాన్నగారె ఒకటే కొరదా
ఏమయితేనేం? ఇరువురి
క్షేమం ఒక కావ్యమై ధ్వజించెను వరదా!

— శ్రీరంగం శ్రీనివాసరావు



శ్రావణాంబర మేఘావరణములోన
రంగురంగుల మేలి తోరణము లేల?
దిగ్వధూ చరణారుణ దీప్తిలోన
ఏ లలిత మౌనహృదయేచ్ఛ మేలుకొనును?



నువ్వు చచ్చిపోయిన రాత్రి నవ్వలేదు
తరుణ మేఘావృతమ్మొక తారకేని;
నమ్మ నారాక యాదృచ్ఛికమ్ము సుమ్ము
నాటి నీయవసాన క్షణమ్మునందు.

నేనుమాత్రము నవ్వుకొన్నాను, నిన్ను
నీ హఠాన్మృత్యు సాన్నిధ్య నిద్రగాంచి;
లోక మేద్వనీ, బాధావిలుప్తమంత
నీబ్రతుకు, నే నెరుంగుదు నిఖిలగాథ!

కలల సంజ మసక కనుమూయ బోనీక
కళవళించు గుండె కంచుడేగ!
ఎలుగు మూగవోయి వెలుగు పిలుపు లేక
ఔక్క లార్చుకొనును రేయి పవలు!



అవధి యెరుగరాని ఆశాంచలమ్ముల
తద్గరుత్స్వనమ్ము గాఢ్గదికము;
కనులురెండు నీటివనరులు, సాంద్ర జీ
మూతగర్భకుహరములకు నురుకు!

ఈ పృథుల విశ్వవీథుల నేతమన్న
చించి, కనరాని కాంతి యాచింతువోయి?
నీ మహాయోగ విభ్రాంతి నేటికేని
నమసి నీకు సుస్థిరశాంతి సాధ్యమౌను!

ఒకనాడు నేను నీవలె
పెకలించితి నా సమస్త పీడితహృదయ
మ్ము, కఠిన కారాగార న
రకపు టెరుల, కంటె నందు బ్రతుకుపసిండిన్.

నవ్వుకొన్నాను నాలోన నాడు మాత్ర
మా రహస్యమెరింగిన కారణాన
మరల నీ మరణాన నీ మన్య జీవి
త ప్రయోగాన నవ్వు ప్రాప్తమ్మునాకు

కాలం మారింది నేస్తం!
కల నిజమయి లోకం సమస్తం మరోలా
పాలించే మంచిరోజే
ప్రభవమయి జనం బానిసత్వం నశిస్తే
కౌలీనం మారణం రక్తనదవిహరణం
కానిపించే చరిత్రంతా
లోపిస్తుందిలే! నీ
తరుణహృదయ గాథారహస్యం యిదేలే!

వెనుకటివలె కాదోయీ
మునుపటి రోజులు గతించి
పోయిన వోయీ
మనిషికి విడుదల మార్గం
కనిపించే సూచన లదు
గంటిన వోయీ!

చదలంటిన నీ యెదలో
చెదరిన స్వప్నం, పగిలిన
జీమూతం, యే
ముదికన్నుల భూతయుగా
న్నెదిరిస్తుందోయి, కొత్త
యేలిక లెవరోయ్?

భూగర్భం అట్టడుగున
సాగిందొక ప్రాక్తనాస్థి
సంకుల సమరం
రేగిందొక పెనుప్రళయం
మ్రోగిం దాఖరి తుఫాను
పూర్వాశలలో!

చెరకాలం వచ్చిం దిక
మరలో తలదాచుకున్న
మనుగడ వడిలో
పరమాణువు పగిలెనులే
నరజాతికి చరమకాల
నరక మిదేలే!

ఇది కాదులే ప్రపంచం
కదిలే మార్గం, వెలుతురు
కానని గదిలో
నిదురించే మాఖైదీ
హృదయం కాసిన తొలికల
యేదో వినవా?

అవధారిక
అవతారిక
వరదాశయ మీడేరుత!
భవ దభయమ్మిం దేలుత!



ఇది చెరకాలం
మనుగడ మూలం!
అణువణువున పెనుకదలిక
జననం మరణం లేదిక
రానున్నది చీకటికల
రాబందుల రెక్కలవల
ఏం లాభముంది భయపడి
ఈ పెడదారిని దిగపడి
మనిషికి మేధాసంపద
మనుగడకే ఒక ఆపద;
లేకుంటే యీ న్యాయం
ఏ కష్టపు టాదాయం?
ధరిత్రినంతా నిండిన
చరిత్రకడుపున పండిన
స్వేచ్ఛా సమరం నేటికి
సెలవన్నది జనకోటికి
ఇది
చెరకాలం
మనుగడ మూలం!
ఇది కాలం చెర
శోకం పాతర!



పట్టిన పిడికిలి వదలకు
మట్టిన జాగా కదలకు
ద్వేషం మప్పిన వేషం
స్వేదం చెప్పిన వేదం
నీ కెంతో ఉపకరణం
నీ కది కంఠాభరణం
కచ్చకు రోజులు వస్తయ్
స్వేచ్ఛకు దారులు తీస్తయ్



జగతి బాధాపరిచ్ఛేదము
కవిత క్షుధాహృదయ క్లేదము
నీ విషాదం వరి దండుగ
ఈ ప్రమాదం మన పండుగ!

పందులోపలి మురికి కాల్వ
అందు మన లాభాల నిల్వ
మూట గట్టుకుపోవలేము!
కోటిజన రక్తాశ్రుచయము!

బ్రతుకు మిథ్యా శృంఖలితము
చదువు బాధా సంకలితము
జయిలులోపల స్వేచ్ఛకలదు
బయట క్షణమ్మయినా వలదు!

ఎందుకూ కొరగాని వాడ!
ఇంక దిగవోయ్ గాలిమేడ
స్వేచ్ఛమాలిన జీవితాలు
ఖైదుమధ్యను శేషితాలు!



గగన భాగం వంక చూడు
వెలుగు గ్రహాల మేలిగూడు
వాటి గమనంలోన వెదుకు
సృష్టికాయుష్షెంతమటుకు?

తారకావళి పరుగెందుకు?
మానవాళికి కరువెందుకు
ఉన్న వెలుతురు చాలకనా
దున్ను భూములు పండకనా?

నిద్రితాంధ ప్రపంచానికి
మేలుకొలుపులు తొలిజనానికి
నీ పదమ్ముల రేగు దుమ్ము;
మా పథమ్మునె నువ్వు నమ్ము!



తిండికోసం పూట పూట
కొట్లముందర పెనుగులాట
ఎందుకొచ్చిన బాధ బాబు
చించిపారెయ్ ఖాళిజేబు!

దాచుకోని దాచుకోని
ఉన్నదంతా అమ్ముకోని
నల్లబజారు పంపకాలు
పెద్దమ్మసిగ వంపకాలు!

ఇంతకన్నా మంచి రోజు
వచ్చిదులపదు బతుకుబూజు;
అధోగతి పాలైన కొలది
అడుక్కుతినదు ఆటవెలది!

కళ్లుముయ్యక ప్రవేశించు
పళ్లునొక్కక నివేదించు
నీ కృలేజా లేని మాట
ఉక్కుమువ్వల నల్లతోట!



కాదనం లేదనం కాలసర్పం భయం
రాదనం భావిలో రామరాజ్య ధ్వజం;
ఏదెలా వచ్చినా యేడ్పుమాత్రం నిజం
సోదరుల్లార! వస్తుంది చస్తే నయం!

చేదనం జీవితం చేదుకున్నా విషం;
రోదనంవల్ల మీ రోజులే వేస్టు; ఆ
మీద లోకాన్ని ప్రేమించడం రొష్టు; ఓ
సోదరుల్లార! వస్తుంది చస్తే నయం!

నిన్న స్వేచ్ఛావహం; నేడు కారాగృహం
అన్నలం తమ్ములం అంధులం అందరం
తన్నిపోకండి సత్యం శవం సుందరం
కన్నుమూసింది మాకంటె ముందే సగం!

దేనికయినా సరే తెంచుకోకండి మీ
బానిసత్వాన్ని కాపాడు సంకెళ్ళు; మీ
మేను జీర్ణించినా మేలివాకిళ్ళు మీ
మౌన సందేశ కర్మాలయాలే సుమీ!



నిజంగా విషాదప్రణీతం ప్రపంచ
ప్రజానీక గాథా ప్రబంధం సమస్తం!
రుజూచెయ్యి నీవే మరోసారి నేస్తం
అజన్యానికే లోకమంతా నిబద్ధం.

మరెన్నాళ్లు బాబూ! ప్రమాదం ప్రమాదం
పరిస్పందులం మేము, ప్రాణాలకోసం
పరాధీనులం, మమ్ము బాధించు మోసం
ఖరీదెంత? ఇంకెంతకాలం వివాదం?



దగాపడ్డ మా జీవితం మంటిపాలా
సగం లోకభారం నిషా తగ్గుతుందా
జగత్తంత శాంతిధ్వజం వ్రాలుతుందా?
రగుల్కొల్పి పోకోయ్ దురాశల్ని అలా!

నిరాధారులం, మాకు నిత్యావసానం
ధరిత్రీతలంలోన దారిద్ర్యపీడా
పరిష్కార మీరోజె, పాపిష్టివాడా!
శరవ్యం పరీక్షించి సంధించు బాణం!



నిరీక్షించవకోయ్ విప్పు నీరక్తనేత్రం
ఖరీదైన ప్రాచీనకాలం కనుక్కో
మరోజీవితం ముక్తిమార్గం వెతుక్కో
ధరించాలి పీడాపతాకాన్ని మాత్రం!



నిరుడు విరిసిన నీలగగనం
నేడు కనపడదమ్మా
నిరుడు విసరిన శీతవాయువు
నేడు మసలదు తల్లీ!

నీలిరెక్కల కాలవిహగం
నీడ జిక్కితి తల్లీ!
జాలికన్నుల కారుచీకటి
ప్రోల నిలిచితి నమ్మా!

ఖంగుమన్నవి మృత్యుదేవత
కాలి యందెలు తల్లీ!
చరమ రాత్రించరుల సన్నిధి
జలదరించితి నమ్మా!

కలల బ్రతుకున గాలిమేడలు
కరిగిపోయిన వమ్మా!
వెలితి కన్నుల వెలుగు కోసము
వెదకికొందును తల్లీ!

స్వేచ్ఛకోరిన పేదరక్తం
వెల్లబారిన దమ్మా
జనసమరమున పరాజితుడను
సెలవొసంగుము తల్లీ!

ద్వేషబుద్ధిని ధిక్కరిస్తే
దోషమెవరిది తల్లీ!
తీరులేనిది నేటి లోకము
నేర మెవ్వరి దమ్మా?



ఎవ్వరక్కూడ
పాడేది యింతరాత్రి?
నిద్ర పోతోంది
పాపం, దరిద్ర ధాత్రి!
ఓ దగాపడ్డ
జనులారా! ఉరికి వెరచి
గాయపడిన
గుండెల్లార! కళ్లు తెరచి

బతుకు పెల్లలు
వెదకండి! చితులవెనుక
నిత్యచైతన్య
రాగ ముందేమొ? కనక
లాభ మేముంది
మీ తుది క్షోభ వలన?
మీ కొరకు
తపిస్తున్నది మృత్యులలన!
మలుపు తిరగని
బాటల కళవళించు
పలిత దీపాలు
మిమ్మల్ని పలుకరించు
చివరి గడియల
కష్టాన్ని జీర్ణ దీప్తి
లోన గడపండి
దీర్ఘ నిద్రా నవాప్తి!



ఆర్పుదీపాన్ని, యీరోజె తీర్పుమనకు
ఆర్పు దీపాన్ని,
మన బతుకాఖరింక

వెర్రిగాలి మాటలు మరి వినకు వినకు
మేను చించినా
చూడకు దాని వంక!

వెలుగు చూడలేవోయ్ మన వెలితి కనులు
పీక తెగినా
సరే గుండె విప్పబోకు

వెదుకు జాగర్త! చీకటి వెనుక గనులు
బతుకు పసిడి
రహస్యాలు, బహువరాకు!

చావులేనిది సృష్టి: ఆశ్చర్యపడక
మంచు తెరలాగ
చీకటి పెంచుతుంది
(మానవుల కది పానకంలోని పుడక)
దృష్టిలోపాన్ని;
మనదారి తెంచుతుంది!

ఇది అనంతం: నిశాంచలం వెదికి చూడు
మేలి రంగుల
మెరుపు దీపాలశాల!
అది ప్రమాదం, సజీవాన్ని అడిగిచూడు
జీవితం అను
మానాల కావినేల!

ముందు లేదనుకోవటం మొదటితప్పు
ఆరిపోయింది
మన నిజం అందువల్ల
విరుచుకుని పడుతున్నది పెద్దముప్పు
జారిపోయింది,
మన ధ్వజం! పోరు కల్ల.

ఇవటి విద్విలాసంలోన రుచి చెడింది
కేవలం దగా
పడి మనం చావరాదు
కడకు మరొక లోకం సృష్టి కలుగుతుంది
కొత్త బతుకు వి
రుస్తుంది, కోతకాదు!

ఇక బిగిస్తారు తాళ్లు గొంతుకల చుట్టు
ఏడవండి, బాధ
పడండి
ఏడవండి
బాధలోనె, గొంతుకలోనె బ్రతుకు గుట్టు
ఏడవండి, బాధ
పడండి
ఏడవండి!



ఏది కడసారి గానం

– మరెందుకింక?

మంచిది, ధరించు మౌనం

– ధరింపమనకు

వెయ్యి కన్నీళ్ల స్నానం

– రుచింపదిప్పుడు

విపరకొక సారి ధ్యానం

– రచింతువిపుడు!



జనం చచ్చి భోజనం లేక
దినం ఒకే రాక్షసంకేక!
మనం మీద దయమాలి వెదుకు
ధనం వదుకు సాధనం కొరకు.

నయం నేడు నీ పాడుముఖం
భయంవల్ల రాబోదు సుఖం!
కవీ, వేడి కన్నీళ్లు చిలుకు
స్తవం మాని వాస్తవం పలుకు.

మనం చచ్చి నెమ్మనం లేక
దినం ఒకేబాధ; ఎందాక?
ఋణం కన్న దారుణం లేదు
రణం దీని కారణం కాదు!

స్థిరంలేని మన వెతల చెంత
చరిస్తుంది ముందాశ కొంత
హరిస్తుంది ప్రస్తుతం కనక
పరం మాట ద్వాపరం వెనక!



నీమను చుక్కలార్చి తెలి
    నీడల స్వేచ్ఛకు దూరమైన కా
రా నరకమ్ములోన నిదు
    రన్ బెనుచీకటి గప్పికొన్న నా
మేను స్పృశించి శీతల స
    మీరము వీవగ మేలుకొల్పి నా
వీ నిరుపేద మౌన హృద
    యేచ్ఛను నేటి శరద్విభావరిన్

నా కిపు డీ ప్రపంచ మొక
    నగ్న శతఘ్నిగ దోచి జీవకో
టీ కటువాటికాకృతి న
    టించెడు నిత్యము నా యెడంద, బా
ధా కలుషమ్ము, ప్రాక్తన క
    థాస్మృతి చిహ్నమునై జ్వలించు నీ
శోక సుధార్ద్రమూర్తి గన
    శూన్య గవాక్షము మ్రోల నిల్చెదన్.

అంతములేని యీ భువన
మంతయు నాకు పరాఙ్ముఖమయ్యె; వి
శ్రాంతి యెరుంగ దీసరికి
రాగ విలుప్తము జీవితమ్మె; దు
ర్దాంత తమఃపరీతము, ని
రంతర మృత్యుకరాళహాస ని
ష్క్రాంత విపద్విలోకిత ని
శాంతము నాకు నివాస మయ్యెడన్

నాకయి నేను దుఃఖపడ
నా, జనపాలనమే నియంతృ బా
ధాకులమైన దంచును వ్య
ధావిత చిత్తముతో కృశింపనా,
లేక మహాపరాధిసని
లేని స్వయంకృత దోషమింత నే
నే కొనితెచ్చుకోన, కరు
ణించెడు నేత్రములేని రాత్రులన్

ఈ శరద్వేళ హిమవదాకాశ వీథి
చిలుకరించిన నీ దయాశీకరముల
తడిసిపోనిమ్ము నా దుఃఖితార్ద్రహృదిని
నా కిదేనేమొ కడసారి నగ్నశాంతి!

వెలుగులేని నైరాశ్య జీవితమునందు
స్వప్నవీథుల నిత్యసంచారినైతి;
పూర్వపుస్తక సాంగత్య పుణ్యవిధిని
వెదకి కొంటిని ఆనంద పదవిజాడ!

కలువరించితి తొలుత చీకట్లతోట
అందరాని దివ్యపదార్థ మభిలషించి
తుదకు స్వప్నాల తూలిన బ్రదుకు గాలి
మేడలే నా కుటీరాలు నేడు కూడ!

నన్నుపహసించు మూఢ మానవుల కింత
శ్వాసశక్తినేదైవ మొసంగినాడొ
లోక మీనాడు విశ్వాస లోభగతిని
అభ్యుదయ మెరుంగదు విలయమ్ము దప్ప.

౮. చెరసాలలోన నశి
    యుంచెద నీవలె నేలరాలి, బా
ధావిత మీయుగమ్యు జన
    తాభ్యుదయోద్యమువింత, నీవు నా
కై పరమాంధ్య వేళల వి
    యత్పథమెల్ల చరింపబోకు, నా
యీ చలితార్ద్ర నేత్రము లి
    దే విధి నీకయి విహ్వలించెడిన్!



ఈ పగిలిన కంచుగుండె
ఈ రగిలిన మంచుమంట
పలికించునే జీవభారం
పలపించునే దూరతీరం?
ఈ సుప్తకంకాళ కోటికి
ఏమి బంధం మాడపాటికి?

వెళిపోకు, వెళిపోకు నేస్తం
కళవళిస్తుందీ సమస్తం!



అజ్ఞానపు టడవి మధ్య
ఆమూాల భువనం మిథ్య
ఆశాశ లధిగమించేందుకు
ఆకాంక్ష లుపశమించేందుకు
వైతరణి కెత్తవలె వంతెన
వైరాగ్య మొక్కటే చింతన!

వెళిపోకు, వెళిపోకు నేస్తం
కళవళిస్తుందీ సమస్తం!



ఎర్రు పాలెపు
మురికి కాలవ
చీకటి కప్పుకొన్న కాలవ!

శీతకాలం
భయందేనికి
జీవచ్ఛవం నిశీథానికి?

ఊరివెలుపల
ఆరుబయళ్ల
హోరుమంటూ చీకటిగొంతు

వినకు నేస్తం
వెర్రి కేకల
చీర విప్పుడు చీకటి నేడు!

చీకటిలోంచి
వెలుగులోనికి
మృత్యువు నుంచి సజీవానికి

వెళిపోకు వెళిపోకు నేస్తం
కళవళిస్తుందీ సమస్తం!



వెలుగు నోచుకోని
వెలితి దాచుకోని
కన్నులార! ఎందు
కంత మృత్యుభయం?

కన్నతల్లి కడుపు
కెన్న డాటవిడుపు?
మృణ్మయం జననం
మృత్యువొకటె నిజం;

మృత్యుముఖం నుంచి
నిత్య జీవధార!
మోక్షపథం కూడ
మృత్యుముఖం నీడ!

వెళిపోకు, వెళిపోకు నేస్తం
కళవళిస్తుందీ సమస్తం!



ఈ జగత్తంత పెద్ద జయిలు
కరిగిపోని కారుమొయిలు!
తీయదనం, చేదు, నలుపు
వెలుగు పంచలేని తెలుపు
జీవకోటి బంధనాలు
జీవితాల శాసనాలు!
మనిషి పురోగమన గాథ
మనికి మరోమార్గ శోధ!
జనంలోన మనం విరిగి
మనంలోన జగం కరిగి
గతం, జగం, జనం మనం
హతం;

మహోదయాగమనం!

వెళిపోకు, వెళిపోకు నేస్తం!
కళవళిస్తుందీ సమస్తం!



కాళ్లు తెగిన వాగ్దానం
గదికి వెనక
కళ్లులేని భావి శకం
కలలు కనక
వర్తమాన మంత ఒక మ
హార్త గళము!
పురానేక పాపఫలపు
పరిమళము!



పద ముందుకు, వెనక ఆపద
ముది కనులకు లేదు కౌముది
గదిలోపలి నలుపు మూగది
పదనేస్తం! వెనక ఆపద!

ధర పెంచిన పాటలాధర
వలపించే పసిడి త్రోవల
ఎదగాలికి రేగు పయ్యెద!
పద ముందుకు! వెనక ఆపద!

జగమంతా పచ్చిలంజగ
కలవారికి విప్పుకోకల
మన సెందుకు రోరి వేమన!
పదనేస్తం! వెనక ఆపద!


38

గతి తప్పిన జనం సంగతి
తలమాసిన తత్త్వవేత్తల
కలరేగిన వెర్రికేకల
పదనేస్తం! వెనక ఆపద!

కలకాలము పూరిపాకల
వెలలేనిది ఊరి కోవెల
మదికయినా కొంత నెమ్మది
పదనేస్తం! వెనక ఆపద!

తరలింపకు బ్రతుకుజాతర
పరమాత్మకు విప్పి చెప్పర
కలికాలపు బ్రతుకు టాకలి
గతి తప్పిన జగతి సంగతి!



నువ్వు పోయిన
సాయంతనం
నవ్వలే దాక తారకూడా

జలదరించిన
ఆకాశమే
ఒక్కపెట్టున నవ్వుకొన్నది

నిజంగానే
నీకు తెలియదు
చావులేదని రేపురాదని

నిజంగానే
నీకు తెలియదు
భువనమంతా బుద్బుదమ్మని;

రణంకన్నా
మరణం నయం
పరమగానం శరణ్యమ్మని

నువ్వెరుగుదువు
నేస్తం నిజం
బతుకు కదలికి పొంగురాదని

నువ్వెరుగుదువు
నేస్తం నిజం
కడకు మృత్యువు కదలిపోదని

నువ్వెరుగుదువు
నేస్తం నిజం
సృష్టి కాయుష్షెంతవరకో

నువ్వెరుగుదువు
నేస్తం నిజం
తారకావళి దేనికొరకో

నువ్వెరుగుదువు
నేస్తం నిజం
సంధ్యాగమన రహస్యగాథ!

అందుకని నువు
చివరిదాకా
భోగజీవం భజించావని

బతుకునంతా
మంచు వన్నెల
మసృణ కాంతిగ సృజించావని

జాతకాలకు
జీవితాలకు
తెగని బంధం రచించావని

నీ మరణాన
చీమకయినా
యింత దుఃఖం కలగరాదని

వసంతంలో
హసించే సుమ
దళంవలెనే చివరిదాకా!



నిశ్శబ్దపు కాసారం లోతులనుంచి
నిదురించిన పాతాళపు తలుపులదించి
ఎవ్వరిదా సందేశం?



ఓ ఆక్రోశించే వెలివాడ!
రః అన్యాయపు ఒడపివాడ
వరుని మువ్వెరుగని విధాన
నడిపిస్తున్న దొరే ముఖాన

అజ్ఞాత సీమాంచలాల
ఆవరించిన ఆశానిలాల
వినిపించే వెలుపంటి సత్యం
విన్నావటయ్యా నేస్తం?

ఆ సుసూర తీరాల జ్వాల
చూపిపోయిన కలలవేల
వెలిగించినా జాతి సముత్రం
విస్మరించకు, జాగ్రత్త నేస్తం!

నాగరికత వస్త్రంలో ప్రాకిన విషం
నగ్నంగా, అసభ్యంగా బతికే జనం
కొండల కోనల తిరిగి తిరిగి తిరిగి
తిండి తిప్పలకు ప్రాణం కరిగి

వినిపించిన ప్రతి భయంకరరావం
కనిపించిన ప్రతి వికృతాకార జీవం
వికసించని నరమేధస్సున కతీతమయి
విరిసె నిలాతలంలోన మహాదైవమయి!

నదీనదాలు, వాన లుప్పెనలు త్రాచులు
మదగజా లడవిజంతువులు రేములు
అన్నీ మనుష్యుల నీరాజనంకోరి
అవతరించెను బ్రహ్మాండశక్తులై కాలంమారి
ప్రజలు కనుగొనిరి వ్యవసాయం
ప్రభవించెను మానవపరస్పర సహాయం

సమాజం జనించి, సమిష్టి జనభారం
సమూహం; జాతి, కులం, మతం, విహారం
పెనుగాలివలె రేగ, నాగరికత రెచ్చి
విధివిరామంలేని సంఘగమనంలోన వ్యక్తి వచ్చి
మన పురాతన దైవాల ప్రాబల్యం జీర్ణించి
మనుష్యు లారాధిస్తున్నారు సమాజాన్ని
సమూహాన్ని తెగవర్ణించి!

మంత్రాల మహిమవల్ల నడచిన గతం
యంత్రాలవలె నడుస్తుంది ప్రస్తుతం
గతంపయి రోతవలన, వర్తమానం అనుమానం
మతంస్థానంలోన నిరర్థక మహాప్రస్థానం!

అనాదినుంచీ ఒకే ఒక ప్రశ్న నేటివరకు
అహం బ్రహ్మోస్మి పలుకులోన ప్రత్యుత్తరం వెదుకు;
భిన్నత్వంలోన యేకత్వం కనిపించక తప్పదు
భీకర సంగ్రామం మధ్య దైవం గొంతు విప్పదు!

ప్రశ్న ప్రశ్నలాగే ఉంటుంది; ఎక్కడి దీ జగత్తు
పరమాణువు విరజిమ్మిన యీ మహావిపత్తు!
అస్మదీయమ్మేది, భవదీయమ్మేది, బతుకెందాక
ఆవరించిన భగవద్గీత వెనుక వ్యక్తి పొలికేక!

ఆశ్రయించిన ప్రతిధర్మం, పరమావధి చేరలేక
అరవిందుని మరణం అనుభవానికి అతీతంకాక
ఒక మహాప్రయోగం సమస్తం నాచరిత
పెకలించిన కనుపాపల నిస్తబ్ధత!

వీడ్కోలుపు సంజల మసక ముసుగు కసరు
వెలుగు వెనక యెలుగు నస్సుపడిన పసరు!

తిరస్కృత హృదయం నుండి జీవరక్తం పిండి
విరచించిన నాకడసారి నిట్టూర్పు లాశాశలు నిండి
మృత్యాంగణమ్ము నకు తిరిగి ప్రయాణం కడుంగడు కష్టం
మిథ్యామయమ్మయిన యీ వదలిన లోకం దురదృష్టం!

ఈ చీకటిలో నించి, కాలాంతర విస్మృత వీథులనుంచి
ఇంత దృష్టికేని నోచుకోని విగతమనః పంజరం చించి
కోరుతున్నా నొక పిడికెడు వలపునేస్తం!
ఈ రాత్రికి కడవెడు కన్నీళ్లయితే మాత్రం
ఆర్పలేదు యీ జనమహోర్త సంక్షోభం
తీర్పలేదు యీ జగదనంత సంతాపం



అనుపశ్య యథాపూర్వే ప్రతిపశ్య తథాపరే
సస్య మివ మర్త్యః పచ్యతే సస్యమివ ఆజాయతే పునః



నవ్వుకోని నవ్వుకోని
యవ్వనాన్ని విడువుకోని
గుండెబలం చింపుకోని
నిండుమనం మండిపోని!

భుజం తడివి చూచుకోని
నిజం మడిచి దాచుకోని
గతం మరిచిపోదు కలం
వ్రతం చెడిన లేదు ఫలం

రేపుకొన్న మహదాశయం చితికి
రేయి పవలు విహ్వాలించే మతికి
కాంతి లేక; వేయికన్నుల వెతికి
శాంతికొరకు; ఎన్నాళ్ళిలా బ్రతికి?

వాలువాలు వృథా నీ జీవితం
మేలుకోని హృదయంలోని గతం
గతిస్తుంది క్రమక్రమంగా రేపు
గమిస్తుంది నిరాశల మునిమాపు!

లేక నీకు గుండెబలం ఒకింత
నీ కనుగవ కారుచీకటెపుంత
చూడలేవు యీ జగద్రహస్యం
వీడబోదు నిన్ని నైరాశ్యం!

నీ బ్రతుకంతా ఒక గాలి పడగ
నీ పరమార్థం ఒక నీటి బుడగ
పోసుకోకు ఆదర్శాలవాడ
దాచుకోకు ఆవేశాల నీడ!

ఛీః యెడారి బ్రతుకునకు సువ్యతికి
మాయపోని స్వప్నాంతర స్మృతికి
తిలోదకం నీకోసరం వదిలి
తిరోగమిస్తా నీ జగతి కదలి



దిక్కులేని జనులకు
తెలుపురాని కనులకు
పురాతనం మంచిది
పురోగమన మెందుకు?

బలంలేని జనతకు
ఫలించెడిన చరితకు
మరోయుగం దేనికి
మంచికాని దానికి?

పసిడికలల బొమ్మకు
భావికాలమమ్మకు
మందిమేలు కోరక
ముందుచూపు చూడక!



వెళ్లిపోకు, గుండెచితికి
ప్రేతభూతాలం వెతుక్కునే
కళ్లు విప్పుకోకు, కలల
గాలిమేడ పిడలంటు, క
న్నీళ్లు కార్చబోకు, బ్రతుక
ని, కళేబరాన్ని బాబు కొ
న్నాళ్లదాక; నిస్పృహపడి
నా యిదేకదోయి జీవితం!

ఈ నిశీథి గాథ వెనుక
యే మహారహస్యమో
కానలేక బాధపడకు,
కాటికావలా జనం
లేనిచోట్ల ఒంటరిగ వ
లించి వచ్చిపోకు, నీ
లోని లేమి లోతులకు తి
వోడకాలు పల్లుకో!

తొక్కబోకు వాపుగడప
తోలుబొమ్మలాగ, నీ
వాక్కు మృత్యుహీనమని
పాట పాడుకో, సగం
చిక్కి వన్నెవాసిన, గతి
చెడ్డ వారకాంత కా
రెక్కిపోవు దారినిలిచి
యేదృ లాభమేమిలే?

కళ్లు చించుకోకు, గగన
గర్భమందు నీలి వా
కిళ్ల శూన్యతోరణముల
కేసి మాడలేక, చ
న్నీళ్లు చల్లుకోకు జగ ము
నిత్యమన్న మాటకై
ఒళ్లు పంచుకోకు పడతి
ఊర్పు వేడికోసమై!

ముళ్లదారి బడ్డబ్రతుకు
మోసపోదు, పేదవా
రిళ్ల న్యాయధర్మము లొక
రీతిగా చరించు, ఎ
న్నాళ్లు చచ్చినాసరి, నువు
నాయనుంగు తండ్రి! యీ
కళ్లు రామరాజ్యగతిని
గాంచ నోచుకోవులే!



ఎంత యేడ్చి మొత్తుకున్న
ఇదే కదా లోక మన్న !
ఇందు కొరకు ముందు కొరకు
ఎదల నమ్మి కెంతవరకు ?

తెలియరాని పరం పథం
తీరబోని జ్వరం విధం ;
అపస్మారకమ్ము కమ్మి
అవలి వెలుగు నొకటి నమ్మి

దేహ మనగ రోత పుట్టె
తెరువరాని తలుపు తట్టె
కూలి పోవు పూరిపాక
మ్రోల నేల వెర్రి కేక ?



ఈ నిజం నిజం కాదు
ఈ పథం విధం వేరు
ఈ నదం పథం చేదు
ఈ రుతులు గతులు మారు

మీ భయం నయం కాక
మీ కలలు వలలు విసరి
మీ నోట మాట లేక
మీ జాడ నీడ ముసరి

మీ దృష్టి దిష్టి తగిలి
మీ ముక్తి రక్తి వచ్చి
మీ రథ్య మధ్య పగలి
మీ కడల కడలి విచ్చి

మీ రణం క్షణం లోన
మీ రుణం తృణం కాదు
మీ చింత చెంత లేదు
మీ కంట మంట పోదు !



దోషుల స్వగతం:

రక్తాలు రకరకాలు
భక్తిమార్గాల విధం

వాళ్లు మరవి పెళ్లాన్ని
పీకనులిమి చంపేసి
వెధవ కోర్టు ముందుపడి
వెతుక్కొందు కొచ్చాడు
ఉరికంబం!

ఈ మధ్య
చచ్చి స్వర్గ మందున్న
పతివ్రత కనికరించినా
దండ నాయకుడి కింత
దయరావటం కల్ల !
గుప్పెళ్లతో ఉన్నది
గుంజుకున్న లాయరా
భూతలాన చిరంజీవి
ఉరితీసే వార్డరూ
డాక్టరూ సూపరెంటు
అందరూ అమరు లైరి !
ఈ నల్లను లేదు కల్ల
ఈ నెత్తుటి లేదు మత్తు



ఆట వెలదికి :

నీరజాలు కుల్లి నలిచెను నీకళ్ల
నిన్న రాత్రి లేదు నిద్ర నాకు
గాలి లోన పలికె తూలి యా వాకిళ్ల
మరల కలల దాటి దరికిరాకుం !

నిన్ను చూడ లేని నిరస జీవికి
లేదు సౌఖ్య మింత, లేదు ముక్తి
లేదు వాంఛ, కోరలే నింక భావికి
లేదులే మరింక సాదరోక్తి !

కూడుగుడ్డ లేని పాడు సంసారమ్ము
స్వేచ్ఛ కోరినంత చెరల పాలు
జనత గొడ్డు పోయె, జన్మ నిస్సారమ్ము
ఖయిదులోనె బతుకు గడుప మేలు !

కడుపు మంట వలన పడుపు కత్తెవునీవు
నరసరీసృపాల నగ్న బాధ
తీర్చినందుకేన దిక్కుమాలిన చావు
చెలియ ! నిజమునీది చిత్రగాథ !

బుద్ధిగడ్డి తిన్న పూర్వాహ్నమయమందు
ఒంటరినయి వొచ్చియుండు గాక
నిర్జన పదవీథి నీ కొంపగల సందు
రేపుకొన్న బాధ నావలేక !

నీ కుటీరమునకు వాకిలి తెలియక
అరమ కుక్క లెల్ల తరిమి వేయ
పక్క నిలిచియున్న పక్షీంద్రు కలియక
కదలిపోతి మరొక గడప చాయ !

విరిసి ముసరి క్రొన్న యిరుల చాటున
నవ్వినావు ముందు నన్ను చూచి ;
కాలు కదపనైతి కనులు కాకల ప్రోవు
కేకనైతి నావు కేలు సాచి !

ఆ ప్రథమనిశీథి లో ప్రమాద మెఱుంగ
నేరనైతి నిన్నె కోరుకొంటి
వలపు తీయదనము బతుకు వేడుకొసంగ
వెలుగు వడల పసిడి కలిసె కంటి !

ఇరువదేండ్లు గడచె తిరిగి చూడనులేదు
నీగృహమ్ముకాని నిన్ను గాని ;
స్వప్నవీథులందు నగము విచ్చిన నీదు
మూర్తి గందు, మరచి పోవుదాని !

ఇపుడు యవ్వనము విడిచి కొన్న నీమేను
కళితమేమి లేక కాటి కొఱకు
ఆత్ర పడుచు నున్న దన్న వార్తను విని
జైలులోన నేను కాటి నోట !



కాలానికి సంకెళ్లు తొడిగి
కష్టాలకి కాళ్లు కడిగి
అంతరాంతర శక్తులుడిగి

తలనెరిసి
కల వానలు కురిసి
కోరికల బానలు మెరిసి

నాజూకైనవి నీ కళ్లు
నమిలి నీళ్లు
కొరుక్కుని గోళ్లు

వెతుక్కుంటూ పద
వినపడుతుంది వెర్రివాళ్ల సొద
నీ కవితకు పద

నిలుస్తుంది పదేళ్లు
నీ కార్చిన కన్నీళ్లు
కీర్తికి బిగించిన మూడుముళ్లు

ఈ బతు కింతే నన్నా
ఇంత కన్న మరేమున్నా
కని పిస్తే అదొక సున్నా !



బతుకు బరువు చేసి
తూకంలో లాభంకాజేసి
లక్షలు లక్షలు లాభం చేసిన
లక్షింపతీ! సలాం !

అడక్కుండా, విన్నివ్వకుండా, చెప్పకుండా
ఇల్లుఖాళీ చేయించి
తమపేరు ముద్ర వేయించి, మనుషులకోసం
మనుషుల్ని నలిపి, పేదలకోసం పేదల్ని చిదిపి
మాకోసం మమ్మల్ని
మమ్మల్ని మాకోసం
పీక్కుని రక్కేస్తున్న
తలుపూ ద్వార బంధంలేని కొంపలకి
నాథుల్లారా! జోహారు !

ఆడదేడుస్తుంది కడుపుకోసం
ఆఫీసుతోడేస్తుంది ఉపహాసం
ఎంత విదలించినా పలకని మెదడు
కదిలించినా కదలని గుండె
సంతాన పరిశ్రమను
అంత శ్రమ పడి మాకోసం అవతరించిన
ప్రభుత్వపరం చేయించు
కాళిదేవరమౌళీ !

కర్పూరం లాంటిది పక్కాయింటావిడ
అప్పు పుట్టనివ్వదు
చేబదులు బాపతు లేదు
ఇరవయి నాలుగు గంటల ప్రజాసేవలో
పర్మిట్ల సాధనకు పద్నాలుగు పంటల
నలభయి నిమిషాలు
దంపతులిద్దరూ పరిశ్రమిస్తారు
కడుపు మాడుతోంది
భరతుడి తండ్రి భార్యా!
భవతి భిక్షాందేహి !

తుప్పు పట్టిన యినపముక్కలు
కొత్త బతుకు వెతుకు తున్నాయి
నర రక్తం కావాలిట అభ్యంగనానికి
గానానికి గగన మార్గం పోవాలిట
అఖిల భారత చరఖానంద స్వామీ !
ఆలోచించ కండి
ఆశీర్వదించండి !

వీరులు చస్తే స్వర్గం పోతారు
మన కనిష్టులు అయితే
మాస్కోకి పోవచ్చు
మరణించిన నాయకుడి
మసిపూసిన మారేడు కాయ
మన రాజ్యం !

ఎంతవెదికితే యేంఫలం
ఎంతరాస్తేనేం అదే కలం

భూమి గుండ్రంగా ఉండదు
భూమి తనఖా సంస్థకు
గాలి జావగా ఉంటుంది
నిరాహారదీక్షా పక్షులకు

ఆకాశం అంతులేని మొత్తానికి
ఒకటే నోటు అధికారివి
అగ్నిసాక్షిగ పరిణయమాడిన
అంబుజాక్షికి
దీని భావమేమి తిరుమలేశ!
మాం పాహి!



మెదడు మాటల నెత్తురు కక్కుతుంది
కోరికల చిలకల రెక్కల్ని కత్తిరిస్తుంది
చీకటిశవం వెలుతురికి దక్కుతుంది
చితికిన గుండెల్ని చేరదీస్తుంది

గోడలకి మాటల్లేవు
నీడలకి నిదానం లేదు
మాపులేనిది రోడ్డు
నిజంకన్న పసిగుడ్డు
ఎలా ముందుకు వెళ్లను
ఎంతబాధాకరం తల్లీ!
యిన్ని బతుకుల పళ్లను!



బాలెంత కసుల పొంత
భావి కాలాల చింత!
పాపవేరింత లోన
బంగారు బంధనాలు!

శ్రీపతుల గుండె వెంత
ఆపదల వెక్కిరింత!
నిధుల సన్నిధుల లేదు
నిఖిల సుఖ దీప్తిరేఖ!



## పూలబృందగానం

ఊరూ పేరూ లేని తుమ్మెదా
ఉత్తమా యిల్లాలు తుమ్మెదా
గుండెగుచ్చినకత్తి తుమ్మెదా
నిండు ప్రాణం తీసె తుమ్మెదా
కత్తి పట్టిన వాడె తుమ్మెదా
ఖయిదు లోపల నేడు తుమ్మెదా
రేపేమి రానుంది తుమ్మెదా
పాపిష్టి ఉరి కొట్టు తుమ్మెదా
కన్నీళ్లు కార్చడే తుమ్మెదా
కన్న వారెవ్వరే తుమ్మెదా
దిక్కుమాలిన చావు తుమ్మెదా
దేనికే కోరంగ తుమ్మెదా
చివరి క్షణమైనాను తుమ్మెదా
శ్రీరామ యనడే మె తుమ్మెదా

భ్రమరగీతం:

కస్తూరి రంగ రంగ
కావేటి రంగ రంగ
నీ రూపు నీ వక్కన
ఆ బ్రహ్మ యెన్నాళ్లూ
వ్రాసేర నా తండ్రీ!

నీ కర్మ నీ పక్కన
ఎవ్వారి ననిలాభ
మేముంది రా తండ్రీ!
నీలోన బలముంటే
నీ కుంటె ధైర్యమూ
వారెవరు నీ కెదురూ?
చావిపుడు చవుకాయెను
చావరా పిరికి వాడ
వచ్చిపో నా తండ్రీ!
ఖైదులో రంగ రంగ
కన్నీటి రంగ రంగ..



అశ్రు జలం వల్లి
హృదయ వేధవల్లి
ఆరిపోదు క్షణము
గత చరిత్ర యెల్లి

తిండి లేని బ్రతుకు
మండి పోవు గుండె
లెక్క చేయరాదు
లేశమైన ప్రభుత

క్షుధావ్యధకు చిక్కి
అధోగతికి దక్కి
దీన జనుల కెందు
దిక్కుగలదునేడు?

తిరిపె మెత్తలేక
బరువు తోచెబ్రతుకు;
యీ సమాజమునగ
మేవగింపు కలిగె

కామ తృప్తి కొరకు
ప్రేమ తీరు వరకు
దార నొక్క దాని
చేరదీసి యుంటి

సీత సంప్రమతులు
శ్రీపతులకు సతులు
నా యభాగ్యవనిత
నగ్న క్షుధాదుహిత

లేమిలో జనించి
లేమిలో నశింప
సంఘపటము మాకు
సహజ పథము మాకు

ఆత్మ హత్య ముక్తి
యనుచు తలచినాము
ముందు చంపినాను
ముద్దరాలి నేను

వచ్చి పోక మునుపె
నన్ను పట్టి నారు
బతుకనీరు నన్ను
చావ నీరు నన్ను

నేను దుఃఖపడను
యీ ప్రభాతవేళ
వీరి కోర్కెపైన
వీరి చేత చత్తు



ఏ యిజ మైనా ఒక పెను
మాయగ సత్యమును దాచు మార్గముగానే
పోయెను గానీ మరిపో
నీయదు నరుని ముందుకిసుమంతైనా!



లోపల లోహభిత్తి కల
    లోతుల నిష్ఠుర వేదనాపరీ
తాపవిదగ్ధులై విధివి
    ధాన నియుక్తము నోపలేక మి
థ్యాపరి పాలనమ్మునని
    యంతల బాధకు కన్ను మూసినా
రేపరమార్థ విత్తులు త
    రింతును వారి సమాధి స్మృత్తికన్.

## తలపులు

వచ్చి పోయెడు గాలికి
భావ సంచయమ్ము రేగి
నామనః స్థలమ్మున ఆ
శా మహీరుహమ్ము పూయ

ఈ గగన తలమ్మున విహా
రింతును స్వేచ్ఛా శారిక
రీతిగ, విచ్చేయు మోయి
నాతో, పోదము జంటగ!

– కల్యాణి
ఏప్రిల్ 1933



నీ చిరు పెదవుల నడుమను
పూచిన పూవుల పోలిక
దరహాసంబిసు మంతయు
దలగి పోదురా

సెలయేరుల కలకలముల
చిరుగాలుల మృదుగీతల
మంజుల మగునీ పలుకులె
మదికి దోచురా

– గృహలక్ష్మి
జూన్, 1933

## తలపులు

పూరేకు పొత్తిళ్ల
హాయిగా నిదురించి
సౌరభము వీవగా
మేల్కాంచి పోదునా

మేఘాల రథమెక్కి
తారకలతో దివ్య
నృత్యగానంబులను
నేర్తునా ముదముతో?

నెలవంక వెలుగులో
పొదచాటు నీడలో
మెరసేటి మిణుగురుం
బురువునై యెగురనా?

– గృహలక్ష్మి
జూన్ 1934

# రిక్తగీతి

అచట నెత్తుట బడినదే యధమ జనుని
చివికి చిల్లులు వడిన దస్తికల బోను?
అచటి నెత్తుటి లోన యే హస్తముద్ర
మూగిన జనమ్ము గుండెల ముగ్ధపరచె?

ఎవరిదీయాకృతి? తనునశించె! ఈయ
గాధలోకమ్ము చెరసాల గడచి పోయె
తనకు నాయను వారున్నదరికి రారు
ఎట్టి పాపిష్ఠి జన్మ జీవించి నాడొ?

అతని మోమునెత్తుటి ముద్ద; ఆయభాగ్య
జీవనమ్ము నెవరి పాలు చేసి చనెనొ?
ఏ మధుస్వప్నభూముల నెవరి కొరకు
చెదుగు రాచరికపు కళ్లబడి నశించె!

మనవి పేదగుండెలు; ఝల్లు మనును; చూచి
చూచి నిల్చిన నేను చచ్చుపడిపోయి
కాలు కదపని యాపాప ఘడియలోన
ఆతపత్రమ్ము వోలెనల్లాడినాడ!

ఏయనం తాశయఫలిత మ్మేయఖండ
త్యాగశీలమ్ము? ఏ పవిత్రానుబంధ
మేచికొన్నదో యితని దిక్కేని లేని
చావు, మా మానవత్వమ్మె నడలిపోవ!

– భారతి
జనవరి 1940

# ఈ రాత్రి

నలుమూలలా నల్ల
నల్లనివి కారుమే
ఘాలు అటై యిటై ఆ
కాశమంతా నిండి
నా లోని రక్తవాం
ఛలు నింగి కెగిరించు!
చీకట్ల రాసులలో
చిరార్జిత ఫలితాల
కనుల గట్టించినా
క పథాల నడిపించు!
విన్నది విదేశవా
ర్తా సంగ్రహమైనా
పుడమి మొగసాలలో
పున్నామ నరకసం
దర్శనం!
కాళ్లు చేతులు లేని
కంకాళ నృత్యవి
న్యాసం – ప్రళయభేరి!

నా బ్రతుకు పాలాలే
నానావిధాల దు
మ్మెగబోసి హసిస్తే
జగత్తంతా అదే
నంటూ భ్రమించాను!
దూరదూరాన యే
దారిదోపిడి దార్లో!
నరజాతి కళేబర
విరాళం ప్రపంచస
మాధికి బహూకృతం!

– భారతి
జనవరి 1940

## బాబాయికి

నువ్వు దెబ్బతిన్న రోజు
(నీవయి నాకెంత మోజు!)
నీకు నిజంగా తెలీదు
నీచం యీ బతుకు ఖరీదు!
అసురసంజ రాలుస్తున్న నీడ
వొదుల్చుకుని యీతిబాధల పీడ
ఏడవడం మానేసి కవిత్వం కాలుద్దామని
వెలుగునీడల పొలిమేరలు కొలుద్దామని
మధుప్రాంగణంలో పెట్టి పాదాన్ని
మరచిపోయాం మన ఖేదాన్ని!

నేను చెప్పాను వినమని
ఇంక చచ్చిపోదామని
వినలేదు సరికద నువ్వు
మొగలిపువ్వు లాంటిది నీ నవ్వు!

చటుక్కున చూపించావు కామోసు
చతికిలబడ్డ ఖాళీగ్లాసు!
తాగు తాగు, ఒకసారిలా విను
మళ్లీ మాట్లాడమన్నా మాట్లాడను.

నట్టేట్లో పారెయ్యి మనసు
నాజూకయింది అందులోని తమస్సు
విరగడవుతుంది పీడ
మాయమవుతుంది మన చుట్టూగోడ.
అన్నా! నువ్వు వినవు
అన్యాయం చూస్తూ యేమీ అనవు
రోజులలా గడిచిపోతయి
కానీ, కానీ, ప్రతీరేయి
యుగంలా, నరకకూపంలా
చలించదు; యేదో శాపంలా
మనల్ని పట్టుకు వదల్దు
మరోచోటికి కదల్దు.

ఎన్నాళ్లని యీ కన్నీళ్లు
ఎలా తెగాలి మనకీ ముళ్లు
అనుకోకుండానే ఆరిపోతుంది దీపం
అంతా చీకటయిపోతుంది; పాపం
ఏమీ తెలియని వాళ్లగతి
ఎందుగ్గాని మనకు? చూడు మన సంగతి
వెనక జరిగిందే మళ్లీ జరుగుతోంది
వెలుగునీడల మధ్య మన బ్రతుకు కరుగుతోంది!

– హైదరాబాదు
1946

# స్వగత గీతం

ఏ సిందూర నదంలో
మా సంకోచం వినబడు మధుర పదంగా
ఏ సంధ్యాఘాలంపయి
మాసంకేతం కనపడు మలినాకృతిగా!

చలితో వణికే పేదా
కలితో తొణికీ తొణకని కన్నులతో, కా
వలిలో అణగారే గుం
డెలతో భాషించిన తొలిడెందం మాదే!

మాజీవిత మింతేలే
రాజీ పడదీ సమూహరాద్ధాంతాల్లో
బూజెక్కిన రోజుల్లో
మాజీమూతప్రబోధ మాధుర్యమిదే!

తృటిలో చీకటి తటిలో
కుటిలో స్మృతి పోవగ మృతికొరకు వ్యథాసం
పుటిలో వినిపిస్తుంది
ప్పటికైనా, ఆ మహాప్రబంధం మాదే!

నెట్టిన ప్రతి గుమ్మంలో
మెట్టిన ప్రతి గడపలోన మేమేం చూశాం?
పుట్టల చెదపట్టిన తు
ప్పట్టిన భావాల బీరువాలనేకం!

– 1950

# సామిధేని-1

1

వర్షించు నదించే ప్రమాదాన్ని
హర్షించు! సృజించకు ప్రమోదాన్ని
బహిరంతరాల్లోన! క్రమిస్తున్న
ముహూర్తం గమనించి భ్రమిస్తున్న
గత స్వప్నాకృతికి పలికించకు
కడసారి వీడ్కోలుపు! ఝళిపించకు
అవధి చేరని ఆశయాలను పట్టి
ఆవరించని విస్ఫృహలో నెట్టి

2

మృత్యువుకోటలో
చీకటి తోటలో
చిగురించిన హాసంలా

మృత్యువువేటలో
చీకటి బాటలో
నకిలించిన మోసంలా

మృత్యువు మూటలో
చీకటి పేటలో
నవరించిన మెరుపుల్లా

మృత్యువు పాటలో
చీకటి మాటలో
వివరించని వెరపుల్లా

క్షయరోగపు దగ్గువలె
కాలని రాక్షసి బొగ్గువలె
సమీపిస్తున్నది ముహూర్తం
సముజ్వల సంవర్తం!

కంకాళపు టూవలింతవలె
అహంకారపు జేగురింత వలె
సమీపిస్తున్నది ముహూర్తం
సముధ్వాంత సంవర్తం!

కాలభైరవ నీరవ రవంలా
రాలీరాలని ఉరితియ్యబడ్డ శిరంలా
సమీపిస్తున్నది ముహూర్తం
సమున్మీలిత సంవర్తం!

ఆకలితో అలసిపోయిన వ్యాఘ్రంలా
ఆవేశాల ఆక్రోశాల శీఘ్రంలా
సమీపిస్తున్నది ముహూర్తం
సముద్రిక్త సంవర్తం!

3

ఓ నీలగగనమా! తగిలించి
ఉరుముల్ని; వెలుతుర్ని కరిగించి
నీలోన జీవితం మూస్తామే
కాలాల జాతకం రాస్తామే
కవనానికి పాదులు తీరుస్తాం
కష్టాలకి చితుల్ని పేరుస్తాం
నీ తలంపున తన్మయతకు కరిగి
మా తరుణ రక్తవాహినుల మరిగి
తొలి మృత్యు దర్శనం చేస్తామే
తులలేని మూర్ఛల్ని మోస్తామే

4

ఉప్పొంగు మహోదధి మరణిస్తే
ఉప్పెనలు నిస్తబ్ధత కరుణిస్తే

చలిగాలి పసికందు లేదుస్తయి
తెలిమంచు కన్నీళ్లు కారుస్తయి
కారణం చెప్పవా మరి మరణర
మారుణం తీర్చేందుకిది తరుణం
మహోదధి సాగించిన యీరణం
మహేశ్వరి మాంగల్యపు తోరణం
తెంచేందుకు మాత్రం కాదయ్యా
తెరచాప జీవితం చేదయ్యా
మాకు మాత్రం? మాకీ సాగరం
రేకెత్తిన కోరికల జాగిలం!

5

ఎడతెరిపిలేని యీ యెడారి
ఎదకరిచి గాయపరచవేం
అరుస్తందప్పుడయినా యిది
తెరుస్తుం దొక్కసారి తన హృది

ఓ శీతకాలపు చలిగాడ్పు!
మా శిథిల వసంతాక్రోశం
ఈ ఆశయాల యెడారిలో
ఏ గమ్యమెరుగని దారిలో
గతించిన భవిష్యత్తునుంచి
కలకాలపుటవధుల్ని తెంచి
చరమనిద్రని కలవరిస్తూ
జనన గాథని వెలువరిస్తూ
తిరుగాడుతున్న వాస్తవాన్ని
తెలియదని అబద్ధం చెప్పకు

6

ఇల నలుపునింపేదెవరు
ఎద వెలుగు చింపేదెవరు
మన పూర్వ పురుషులు రుషులు
కనలేని దాని వెనక
కలదనిరి సత్పదార్థము
కలగాంచనిది యథార్థము
నలుపులో వెలుగున్నదని
వెలుగులో నలుపున్నదని
రకరకంగా శకశకం
వెకిలిగా వెదుకుతున్నాము

మరోలోకపు వాలకం
మనసుకెక్కని కీలకం

''ఈ తపస్విని వయసెంత?
ప్రేత భూతలంలోన
వెలరేగుతున్నది ప్రశ్న
ఈ ప్రయాణానికి గమ్యం
ఎంతవెదికి నా శూన్యం
బయలు దేరిన చోటికే
దయమాలి మర్నాటికే
చేరుకుంటాము
దీర్ఘనిద్రకై బ్రతుకు
వెలితిలో వేయికసుల
వెర్రితనపుటన్వేషణ
మాసిపోయిన ఋగ్వీథి
వేసి ఫోయని ప్రతి తలుపు
తట్టి, మావర చే తేక.
పెట్టే జవాబూ లేక
అతని ఆమాకీ దారక్క
అదేదారి బడి వెనక్కి
గుండెలీడ్చుకొస్తాము
ప్రతి పతనదుస్థితిలోన
ప్రతికారడవి ప్రతికదలి

ప్రతి మంట ప్రతి గుడి గంట
ప్రతి పీడ ప్రతిచితినీడ
అతని చిరునామాలకై
అర్థం కాని పొలికేక
అతని కోసం స్వాగతం
ఆద్యంత రహితం మనకు
అందుకోసమే స్వగతం
అహర్నిశలతని గురించి
"ఆతగాడెవరు చెప్పరేం?"
అలా అడగటం కూడదు.
తన్ను తానెరగటంలో
దైవసన్నిధి పొందటం;
ఎవడిది వాడే మాసుకొని
ఇహంలోన స్వయం సిద్ధి!
వెళ్లిన దారిని మళ్లటం
మళ్లిన దారిన కుళ్లటం
తాను తానెరక్క పోవటం
తనకు తానైపోవటం
తీరు తప్పని తపస్సు
నోరు విప్పని తమస్సు

- స్వతంత్ర

జనవరి 8, 1954

# సామిధేని-2

గతమసంగతం ప్రస్తుతం కనక బయలు
దేరడం మానుకోకు, నువ్వేరుకున్న
దారిలో గజదొంగలున్నారు నాన్న!
భయపడి వెనక్కి తిరగి రావలదు తండ్రి!

తొక్కిన మార్గం వదలకు
చిక్కిన స్వర్గం విడువకు, చింతించకునీ
కక్కిన గత కాలానికి
చిక్కు విడకపోదు మదికి చివరికి తండ్రీ!

రాద్ధాంతమింత దేనికి
సిద్ధించవు స్వప్నదృష్టిచే చెరిగిననీ
రుద్ధాంతరంగ పంజర
బద్ధాందోళిత పర ప్రపంచ ద్యోతుల్.

కొండల లోయల్లోనికి
మండే కారడవుల తెలిమసిలోనికిపో
నిండని చీకటిలోనికి
పండే పాపాలనీలివాగుల బడిపో

పో ఒంటరి వై ప్రశ్నిం
చే ఓటమితో పలక్క, నీకోసంని
న్నే ఓదార్చే చూపుల
తో ఓపికతో చెదరని తోవలబడిపో

చుక్కేమకున్న చుక్కల
దిక్కయినా చూడక విరుతించే గగనం
మ్రొక్కుబడిని గమనించక
చిక్కని పరమార్థమేదో చింతిస్తూపో

అడిగేవు సుమా, నీవెం
బడిపడి తిరిగే మరుద్రవాన్ని ఝుడుస్తూ
తడబాటుతో ''నువెవరివి
కడలికి యేమయ్యేద''వని కారడవుల్లో

వడి వడి నడవకు, యెదస
వ్వడిలో,కడలేని సాగుబడిలో, పెనుసం
దడిలో కంపించేనీ
అడుగుల్ని తడబడనీకు ఆలోచిస్తూ

నేనెవర్నని నువ్వు నన్నే అడక్కు
ఈ జగత్తు పుట్టుక నుంచి యింతవరకు
ప్రశ్నప్రశ్ననే ప్రశ్నించవలసి వచ్చె
రాత్రినేత్రాల ప్రత్యుత్తరాన్ని వెదుకు

వెనక ముందు మధ్య వేగుతూ ప్రస్తుతం
దాని బతుకు బుద్బుదం విధాన
ప్రస్తుతం గతించి భావిప్రస్తుతమయి
ప్రస్తుతంగతమయి పరిఢవిల్లు

నువ్వుముందు, నేను నోరెత్తక వెనక
ప్రస్తుతం మనిద్దరం బతక్క
ముందుబతికి వెనక మూగ జీవాలమై
కడకు ముక్తి కలల కడలిలోన

అందుకని నువ్వుసాగి పోవయ్య తండ్రి!
కళ్ల చీకట్లు విమ్ము వాకిళ్ల దాటి
కెంపురంగుల మేలిలోగిళ్లు గడచి
అవధి పరిధి యెరగని బయళ్లు నడచి

– తెలుగు స్వతంత్ర
జనవరి 22,1954

# స్వవిషయసూచిక

వరద:

సందేహిస్తున్నారు నవకవిత్వాన్ని
సాహిత్యం లో మన బంధుత్వాన్ని
ఎందుకోసం మన ధ్యానముద్ర?
ఎందుకీ చైతన్యవంతమైన నిద్ర
ఏమంటావుఆరుద్ర?

ఆరుద్ర:

కల నిజపరవడం కాదు కవిత్వం
నిజాన్ని కలగనడమే దానితత్వం

స్వప్నంలోని ఆదర్శవంతమైన స్వర్గం
సాధించిన మీదట అదే సాక్షాత్తూ నరక దుర్గం
కలలు కన్నారు ఆదిమ రాజకీయరుషులు
కలలు కన్నారా స్వార్థరహిత పురాణపురుషులు

చక్కటి కవిత్వం యొక్క పర్యవసానం
ఒక్కగానొక్క భూతల స్వర్గం
జాగ్రదవస్థలోనే దుస్స్వప్నం
అందుకే అనుభవం నినదించడం కవిత్వం
భావాన్ని భయాన్ని వచించి చించడం కవిత్వం

వరద:

అవును, నిజం నువ్వన్న మాట
అందుకే మనం అల్లుకొంటున్న పాట
కాని యీ లోకం తీరు చూడు
కవితకు కలం కాగితం మాత్రం తోడు
అంతకన్న అర్థంకాని జనం
అనర్థకాలను వెతుక్కుంటున్న మనం!
మనిషి వ్యథల గుండె చెరువు
మనిషి కథల కలల కరువు
మంది మధ్య దారి తెగిన రథ్య
బొందితో స్వర్గం నిత్యం ఆరాధ్య!
నిచ్చెనలా నిలిపి కవిత్వాన్ని
వచ్చిన వారెందరీతత్వాన్ని!

ఆరుద్ర:

సమాజంలో కవి గూడా ఒకడే
అయినా విరుద్ధమైన వాడు అతడే
సబ్జెక్టివ్ భావాన్ని
ఆబ్జెక్టివ్ గా రాసినట్టే
ఆబ్జెక్టివ్ బాధల్ని
సబ్జెక్టివ్ గా రచించవచ్చు

పోగొట్టు కొనగూడదదు వ్యక్తిత్వం
అయితే ఆధునికం అంతా అవ్యక్తం
వర్తమాన కవిత యేమిటో తెలుసా వరదా?
అది భూతభవితవ్యాల మధ్య ట్రాన్స్పరెంట్ పరదా

వరద:
సామాన్యులకీ వర్తమానం
సాయుజ్య చింతనలో నిత్యావసానం
గతంలో బ్రతుకుతారు
స్వగతంతో చితుకుతారు
నలుగురితో పాటు నారాయణ
తొలి నీతుల పారాయణ
దేహం వారికొక పెను సందేశం
దేశం వారికో సంకుచిత సందేశం!

ఆరుద్ర:

సందేహం లేని సంశోధన
సందేశం లేని సంవిధాన సాధన
కానేరదు కవిత్వం
దానికి సిద్ధించదమరత్వం

వరద:

సందేశం యెవరి నుంచెవరికి?
సందేహం దేనికి చివరికి?

ఆరుద్ర:

సందేహం నిత్యనైమిత్తి కాలగురించా?
సందేశం మామ్మూలు చిల్లర విషయాల మీదనా
ఏది చిల్లర యేది మామ్మూలు, యేది రొటీను?
క్షణక్షణం ఉత్పన్నమయ్యే సాదా సమస్యలు
పరిష్కర్తవనికి కవిత రాజీనామా చేస్తుందా?
అసలు ఆ ఉద్యోగం కవిత్వం వెయ్యాలా?
ఐన్‌స్టయిన్ని ఐదో యెక్కాల్నేర్పమన్నట్టు
కవిత్వం తో జీవితం గొడ్ల పాకలోని

కసువు ఊడ్పించాలా? కవిత గొరక చీపురా?
కవిత్వం రోజూ వాడని టూత్‌బ్రష్
యాంత్రిక నాగరికత కాంతివంత మైన చీకటిలాగ
జీవితాన్ని ఆవరించి వేళ్లాడు తున్నప్పుడు
శాస్త్రం, చరిత్ర, చర్చ, ఛందస్సుకి విడాకులిచ్చినప్పుడు

జాతి జీవనంలో తిరుబాటు తగ్గుతున్నప్పుడు
కవిత్వం తనపాత ఆఫీసునుంచి నిష్క్రమిస్తుంది
వేదాల కాలంలో దాని దారివేరు
మానవ నేత్రం చూసిన ప్రతి చిత్రాన్ని
గానం చేసిన రోజులు కావు
ఆదిలో దైనిక సమస్యల్ని మంత్రం పరిష్కరించింది

నేడు భౌతిక సమస్యల్ని యంత్రం పరిష్కరిస్తున్నది
వ్యాపార ప్రకటనల మోసానికి కరపత్రాల గాత్రానికి
కవిత్వం సహాయ విద్రోహికాదు
కవిత్వం విజ్ఞాన కూపంలోని ఉదకమే కాని
బాల్చీకాదు, చేంతాడు అసలేకాదు
నూతన ఛందస్సుల యంత్రపరికరాలతో
నూతిలోని నీరుతోడు కొనడం మేలు
దప్పిక తప్పక తీర్చగలిగేది కవిత!
ఎప్పటికైనా మానవ పథికుడు చేరుకొనే

గొప్ప విశ్రాంతి మందిరం కవిత!
ఆధ్యాత్మిక ఆముష్మిక చింతనతో
సత్యం శివం సుందరం స్వరూపాల చూపించి
అనంత అంతిమ సందేశం వినిపించేది కవిత!
అయినా యాంత్రిక జనులది లక్ష్యపెట్టరు
వారి చెవుల చవులు పుట్టవు
వారు కవిత్వాల్ని అన్నం వండమంటారు
ప్రమిదలో నూనె కమ్మంటారు
ఆకలికి తట్టుకోలేరు
చీకటికి భయపడతారు

వరదః

జీమూతం పరిధి
జీవితం పరమావధి
ఎరుపుదిగని సంజవేళ
ఏ సంకేతాల స్వరమేళ
భయపెడుతోంది వీళ్లని?
ప్రార్థించ మంటున్నది దేవుళ్లని?

ఆరుద్ర:

మొదలెక్కడో తెలియని పరుగు
తుద బోధపడక గుండెకరుగు
ఏమీ చేతకాక వీళ్ల విలాపం
దారిమధ్య ఆరిపోతుంది వీళ్ల దీపం
అందుకే తోడురమ్మని అభ్యర్థన
దేవుడికి నిరంతర ప్రార్థన!

వరద:

ఎలుగు లేని వాడి కెలా కనిపిస్తుంది వెలుగు
పులుగు కాని వాడి కెలా విహాయసద్వ్రకృథం కలుగు?
కవిత్వం విధ్వంసక కారణ విచ్చేదన
కవిత్వం నిత్య సౌందర్యా రాధన!

ఆరుద్ర:

ఏది సౌందర్యం?
ఏది మాధుర్యం?
విచిత్రమే సౌందర్యం
విచింతనమే మాధుర్యం
అని కొందరు!
మరికొందరు
తలపులే సౌందర్యం
వలపులే మాధుర్యం
అనుచుందురు
ఏది సౌందర్యం?
ఏది మాధుర్యం?

వరద:

నిజం సౌందర్యం
నిజం మాధుర్యం

ఆరుద్ర:

ఏది నిజమైనది?
ఏమి ఋజువైనది?
కడలి నిజమైనదనుకుంటాను
కదలిక ఋజువైన దనుకుంటాను
ఏది నిజమైనది?
ఏది ఋజువైనది?

వరద:

కనిపించేది మట్టుకే కాదు నిజం
కనిపించనిది కూడా నిజం
ఋజువు చెయ్యని నిజం
రోజూ చూస్తున్న మాట నిజం
నిజానికి ఋజువక్కర్లేదు
ఋజూకానిది కవిత్వానికి ఖనిజం!

ఆరుద్ర:

అయితే కవిత్వం శ్రమా?
లేక కుటీర పరిశ్రమా

వరద:

శ్రమ లేనిదే మనోరమ సాక్షాత్కరించదు
శాశ్వతాన్ని ప్రస్తుతం ఆవిష్కరించదు
వినియోగం లేని పరిశ్రమ వ్యర్థం
విశాల హృదయానికి మొదటి మెట్టు స్వార్థం
కవిత స్వార్థం
కవిత రమణీయార్థం!

ఆరుద్ర:

రాబర్టు గ్రేవ్సు చెప్పినట్టు
ముత్యాలు చేరుకుంటాయి నగల కొట్టు
పద్యాలు చదవబడతాయి ప్రజల చేత
వర్తకుని మనసులో పెట్టుకుని
శుక్తి మౌక్తికాలను ధరించదు
ప్రజను దృష్టిలో నిడుకొని కవిరచించడు
బేహారి తానె ముత్యముల సేకరించు
అటులె ప్రజకూడ కావ్యముల నాదరించు!

– కవిత 1954

# జిప్సీకవి

చిరిగిపోయిన జేబుల్లో చేతులాడించుకుంటూ
తిరుగుతానెక్కణ్నో;
కప్పుకున్న బొంతకు గుడ్డకన్నా కంత లెక్కువ
విప్పుకున్న గగనం కింద కవిత్వాని కూడిగం చేసే బానిసని!

వెదజల్లు తానెన్నో ఉజ్వలప్రణయస్వప్నాలు!
ఉన్న ఒక్కలాగూ మోకాళ్ల మీద చిరిగిపోయింది
ఆకాశంలో ఆశ్రయ చిహ్నంగా చంద్రబింబం విరిసింది
పట్టులా మెరుస్తున్న నక్షత్రాల హాసం
పతానీల్లా ప్రొసల్ని ఒలుస్తున్న స్వప్నజీవిపై కురిసింది

మైకం కల్పించే హిమకణ చషకంలో నానుదురు తడిసింది
భాద్రపదరాత్రుల దారిప్రక్కల వింటున్నాను
ముట్టడించినవి నన్నువెర్రినీడలు
పద్యాలకోసం వెదుకుతున్నట్లు
చిరిగిపోయిన చెప్పుల్లో కాళ్లుదూర్చుకుని
హత్తుకుంటాను హృదయానికి ఒక పాదాన్ని వీణలా!

– కవిత: 1954

మూలం: ఆర్థర్ రాంబో (1854–1891)

ఫ్రెంచి కవి

# గీతం

వీణా తంత్రీతంత్రంలో
పరవశం పొందా నొకసారి
కరకు కాలి బాటపయి
మెరసిన
కాంచనపద విద్యుత్ప్రభలో
ఇప్పుడెరుంగుదు
కవితకు కవోష్ణం
మూలపదార్థం

ప్రాతపడిన
తారా ఛిన్నగగన శాటిని
చుట్టూకప్పుకునేందుకు
ప్రభూ! పరిమితం వెయ్యి

– కవిత: 1954
మూలం: టి.యి. హ్యూం

# ముగ్ధగీత

లేదు నాకు పరమేశ్వరుడు
లేదు నాకు ధరణీశ్వరుడు
తాల్చి యెరుగదు నా
తల్లినల్లపూసల పేరు!
లేదుగూడు, లేదు పాడె తోడు
బహుదూరం ప్రణయం నాకు
కడుపులో కాళ్లు పెట్టుకుని
కలికి గంజికీ వాచి
ఇరవై యేళ్ల యీడు
జవంతో సత్వంతో
విక్రయానికి సిద్ధం నా
వింశద్వర్ష ప్రాయం
కొనేజనం దొరక్క పోతే
అన్యాయానికి అమ్ముడు పోతాను
ఇంగితం సాధనంగా
పాపం పుణ్యం ప్రసక్తి లేకుండా

సాగిస్తాను హత్యలు దోపిళ్లు
ఉరికంబానికెక్కేదాకా
ధరిత్రిలో నిదురించేదాకా
నా నిర్మల హృత్‌క్షేత్రంలో
సాంద్రగరళ సస్యవాటిలో
దుర్గంధం లేచేదాకా

– కవిత: 1954
మూలం: అటిలా జోసెఫ్ (1905-1937)
హంగేరియన్ కవి



తేజోహీనమ్ములు, శుష్కపాండురమ్ములు
దీర్ణప్రాంతమ్ములు, దైన్యబంధురమ్ములు
నిద్రాముద్రితములు, నిరయసంచితమ్ములు
నీ నేత్రాంచలములు, నిత్యవంచితమ్ములు
ప్రేయసి!

సంధ్యాగీతమ్ములు, రాగరంజితమ్ములు
ఆంధ్యవ్రాతమ్ములు, మృత్యుశింజితమ్ములు
నిర్వాణప్రదములు, నిభృతశోకనదములు
నీ సంకేతమ్ములు, నిశిత ఘూకపదములు
ప్రేయసి!

హత్యానేరమ్ములు, క్షుద్రకుటీరమ్ములు
ఆర్తిస్మేరమ్ములు, దగ్ధపటీరమ్ములు
నిందాక్రాంతమ్ములు, మందమారుతమ్ములు
నీ సంకోచమ్ములు నీలిమావృతమ్ములు
ప్రేయసి!

ఏ భూతమ్మిగతి, ఏభవిష్యమీస్థితి
ఈ కాలమ్మంతట సంచితార్ధ నిష్కృతి!
నాలోనీవల్లిన భగ్ననిశీథాకృతి
నీలో మ్రోయించును నగ్ననిరాశారుతి
ప్రేయసి!

– కవిత: 1954

# సంధ్యారాగం

చెరగని స్వప్నం, కరగని వేదన!
వెదరిన భావికి లోకం వేదన
లోలో రేగే మాయని తలపులు
ఆలాపించే తీయని తలపులు
మండే గుండెను మరింత వేల్చగ
నిద్రిత భూగర్భంలో దాగిన
నీరవసమాధులందున రేగిన
చరమాహ్వానం పరచిన పిలుపున
మరణావరణంలోపలి నలుపున
గజగజ వణకే కళేబరానికి
కన్నీళ్లెందుకు? కష్టందేనికి?
వెనకటి దశలో విరిసిన రోజుల
వెదకిన దొరకని స్వర్గపు మోజుల
గుణించుకుంటూ గణించుకుంటూ
కొన్నాళ్లయినా కలల్నికంటూ
కాలం పన్నిన వలకీవలగా
గగనం మలచిన కలకావలగా

దైనిక జీవన వైరుధ్యంలో
ధార్మిక చింతానేపథ్యంలో
విచలించేనా? విలపించేనా?
విషాదగీతం వినిపించేనా?
ఏదెస చూస్తే ఆదెస స్వార్థం
ఈ పరమార్థపు శోధన వ్యర్థం!
జీవిత మంతా తాత్త్విక బద్ధం
శశూదయాన్నే మృత్యువు సిద్ధం!
మనుషులు పుట్టుట గిట్టుట కొరకే
మనుగడ జగడం అంతటివరకే.

ఆస్కారం లేదిట ముందంజకు
అనురాగం లేదీ మలిసంజకు!
ఆక్రోశాలు ఆవేశాలూ
ఆశాలోకపు టాకాశాలూ
సంకేతాలూ సంబంధాలూ
సందేహాలూ, నిర్బంధాలూ
బళ్లో వెలసిన ఉద్గ్రంథాలూ
గుళ్లో విరిసిన దుర్గంధాలూ

స్వాంతం తొడుక్కునే సంకెళ్లవి
ధ్వాంతం తాల్చిన కాలం కళ్లవి!

వీటిని గురించి ఆలోచిస్తే
వెనకా ముందూ మధ్యను కాస్తే
బ్రతుకును కాలుచుకు లాభం లేదిక
చితికిన కోరిక ఫలించక బోదిక

2

ఏది నిజం, ఏదినిజం
ఏనాటిది నీ సంగతి
ఎప్పటిదా ఆనందం?
ఏ సందులు, ఏ గొందులు
ఏ వేటలు, ఏ పాటలు
ఏ వెన్నెల, ఏ చీకటి
ఏవైరం, ఏ నేరం
నీకేవిటి గుర్తున్నది
నేస్తం! నీకేం గుర్తూ?

ఎంత మంచిదాకాలం?
ఎలుగుచింపితే మాత్రం

మళ్లీయిటు వస్తుందా?
మందారం పూస్తుందా
సిందూరం రాస్తుందా
చెరిగిపోయి మాసిపోయి
చెమ్మగిలని యెదలోపల!

గతం నిజం, నిజం గతం
ఋతం లేని మృతం కాని
గతం నిజం, నిజం గతం
కలకాలం నిలుస్తుంది
వర్తమాన మెంత భయం
ఉప్పొంగే వరదలాగ
ఉప్పెనలా ఎంతభయం?

క్రమిస్తున్న యీావయస్సు
భ్రమిస్తున్న యీామనస్సు
రకరకాల సమస్యల్ని
శకశకాల సంశయాల్ని

తెచ్చిపెట్టుకుంటున్నది
తెంచేందుకు సాధ్యపడదు

ఎవరైనా ఉన్నారా
ఈ చీకటి చించేందుకు
అమరత్వాన్నందరికీ
అమృతంలా పంచేందుకు?

మృత్యువొకటి లేకుంటే
ప్రత్యూషం సాయంత్రం
ఈ లోకాన్నావరించి
ఇందాకారాకుంటే
శైశవమూ వార్ధక్యం
సన్నిహితం కాకుంటే
ఈ రెంటిని విడదీసే
ఏ భవిష్య భాష్యముంది?

కొనలేని సౌఖ్యానికి
లేని పోని అనుమానం

చిన్ననాటి హృదయంలో
చిగిరించిన ఆశయాలు
ఊహల్లో ఉండిపోయి
ఒకటైనా తీరలేదు

మనచుట్టూ తిరుగాడే
మనుషుల్లో యెవరాప్తులు
బాల్యంలో నువ్వెరగవు
బాధల్నీ, వేధల్నీ
పూచీ యేముంది నీకు
పుణ్యానికి పాపానికి?
శైశవాన ఆశలెగసి
స్వర్గాలూ నరకాలూ
చావుబ్రతుకు, చేదుతీపి
ఆవుపాడుగు సలుపరింత
రేవుపక్క యేటిపోటు
దిగుడుబావి నీటికరువు
దిక్కెరగని గుండె చెరువు
నీ కర్థంకాని కథలు
నేస్తం! నీకనవసరం!

వలయంగా విలయంగా
పరిభ్రమించే భూమికి
నువ్వెవరివి, నువ్వెవరివి
దవ్వెరగనిదీ జీవం!

అమ్మా నాన్నా ఉండే
ఆ రోజుల జ్ఞాపకాలు
వ్యూహం పన్నేబుద్ధికి
దాహంతీరని కాలం
మళ్లీరాదని తెలుసును
స్మరణలోన మరణ ఘోష!
జనన మరణ గతుల మధ్య
క్షణ క్షణం వర్తించే
అతిసుందర గరుడంచల
శతసహస్ర వర్ణకిరణ
మహోజ్జ్వలిత మీ జీవన
విహంగం!

3

అసలీ వయస్సు
కుసుమిస్తుందా?
ఏటిని దాటగ
ఈ తీరందిగి
ఆ తీరానికి
ఆటంకాలను
అవరోధిస్తూ

ఆ గమనంలో
ఆ ఖేదంలో
ఆయాసంలో
ఆనందాన్నే
ఆరాధిస్తూ
చేరటమేయీ
జీవిత లక్ష్యం!
అసలీ వయస్సు
మొసలేదెక్కడ?

4

అజ్ఞాతాన్నీ
అనంతాన్నీ
ఆదినుంచీ అవిరళంగా
ధ్యానిస్తున్న పూజిస్తున్న
దరిద్రదీన హృదయులంతా
భ్రష్టమతితో దురదృష్టాన
భావించారు జగతి దుర్గతి
శాసించారు జనత ప్రగతి
శాశ్వతంగా జన్మజన్మకు
అంచేతనే సంకోచాల

అంచనాల్లో జ్ఞానవంతులు
మెదణ్ణి చింపుకుంటున్నారు
మొదలే చిత్త స్పష్టత తప్పి
ఇహంలోపల దుస్సాధ్యమై
అహంచంపుక పరం కోసం
ఒకటేధ్యాస ఒకటే బాధ
ఆత్మవంచన చేసేందుకే
అవసరమైంది యీపరమాత్మ
భగవంతుణ్ణి సృష్టించింది
ఫరవాలేదు పాపాలకని!
వయః పరిణామానికేమిటి
పరమార్థం ప్రమాదం తప్ప!

5

వయోమధ్యపు పెల్లల
వల్లమాలిన చీకటి
భయందేనికి నేస్తం!

అయోమార్గపుటంచుల
అందరానిది వెలుతురు
తొందరెందుకు నేస్తం!

ఆవరించిన తమస్సు
తీవరించే వయస్సు
జీవితమ్మిది నేస్తం!

కీళ్లుసడలిన తనువున
ఏళ్లు గడచిన మనుగడ
కెంత సౌఖ్యం నేస్తం!

ఇంద్రియాలను త్యజించి
హృదయనేత్రం విప్పగ
ఏది చీకటి నేస్తం!

వయోమధ్యపుటాకలి
వర్తమానం తీర్చదు
వర్ధమానం నేస్తం!

కీర్తి శేషం బాల్యం
ఆర్త వేషం వేసుక
ఆగమిస్తే నేస్తం

అసమక్షపు శైత
ల్యావేదనావరణ
మ్మందు నిలబడు నేస్తం!

భయంకరపు భవిష్యం
భాద్రపద మేఘంలా
పలకరిస్తే నేస్తం
అసమక్షపుశైత
ల్యావేదనావరణ
మ్మందునడుగిడు నేస్తం!

– ఆలిండియారేడియో
1954

## ఒకగీతం!

అన్నా! యీ బ్రతుకు వేదు
అంతకన్న తెరువు లేదు!
అన్నా! యీ పరుగు వృథా
ఆగి పోవటం మంచిది!

అయ్యో! యీ గొంతువిడదు
అంతకన్న పాట చెడదు
స్వర్గ శిలావేదికల
సంగీతం కరిగించదు!

అన్నా! యీ చింత నీడ
అవతరించదతని జాడ!
ముళ్లదారి తప్పించుక
మళ్లి పోవడం మంచిది!

అయ్యో! యీ వెంతనలుపు
ఆకాశం వింతపిలుపు
ఈ యాత్రకు చివర లేదు
ఈ రాత్రికి చెవులు లేవు!

– కవిత: 1954

# నక్షత్రం రాలుస్తున్నది

నక్షత్రం రాలుస్తున్నది కెంజాయ కన్నీళ్లు
నీకర్ణాల వక్రకులాయాల్లో
కంఠం నుంచి కటీరం దాకా
స్రవిస్తున్నది అనంత సిత వర్ణం
నీ అరుణారుణ చూచుకమ్ముల
ప్రవాళమ్ములు ప్రకాశిస్తున్నవి
మానవుడే నెత్తురోడ్చును
నీ జైత్రసక్తి నికృష్టస్థితి!

– మూలం: ఆర్థర్ రాంబో
కవిత: 1954

# సంచలనం

కమలిన వేసవి కనుచీకటిలో
వరించి ముళ్లమధ్య వరి పొలందాటి
మెత్తని పచ్చిక పైనదుస్తాను
నా తలవని తలంపుటడుగులకు
చల్లదనం సోకుతుంది
నా నగ్నశీర్షం పై చెమ్మగాలి వీస్తుంది

పదాలతో లేదు నాకు ప్రమేయం
భావాలకంత కన్న లేదు నిమిత్తం
నాహృదిలోప్రణయం ఉప్పొంగుతుంది
మేరలేని నీరధిలా
ప్రకృతి పార్శ్వంలో బికారి వలె నేను
పర్యంకాన యెవరో మనోహరప్రమద
పవళించినప్రమోదం నాది!

– మూలం: ఆర్థర్ రాంబో
కవిత: 1954

# నగరం

ఆనందంతో అవరోహించాను గిరిశిఖరాన్ని
ధ్యానించేందుకు పాతక నగరాన్ని
వేశ్యాగృహం, వైద్యశాల, కారాగారం, శరణాలయం, నరకం
విరుల్లా విరుస్తున్న ఘోరాలు!

నా బాధల్ని పరిపోషిస్తున్న శని దేవతవు
వాటికై నారోదనం
వ్యర్థం కాదని నువ్వెరుగుదువు

పారవశ్యం వినా మరేం కోరని
వయసు మీరిన ప్రేయసి కోసం
పరితపించే ముదిమదమూర్తిలా
వాంఛించా నీ మేరలేని వారకాంతను
పునః ప్రభవించే నరక సౌందర్యాన్ని!

చలిబరువున ప్రొద్దు పొదువు మదువుల్లో
తలదాచుక నిద్రిస్తున్నావసరే
చీకటిలో మెరిసే పైడిరేకుల ముసుగుల్లో
సింగారించుకు కులుకుతున్నావసరే

ఆరాధిస్తాను, అపకీర్తిపాలైన నగరాన్ని
వ్యభిచారులు, చోరులు, నాకు
సమకూర్చే సంతోషం
సామాన్యుల కర్థంగాని విశేషం

– కవిత: 1954
మూలం: షార్ల్ బోద్‌లేర్ (1821-67)
ఫ్రెంచికవి

## ఎవరో

ఎవరో విరుతిస్తున్నా
రవతల విఢ ఘోాల చరమ యాత్రాగతిలో
ఎవరో విరచిస్తున్నా
రివతల మృతిలో చెదరిన హృదయ స్మృతిలో

ఆవల ఆకటికుటిలో
ఆవేదనల చితిలో భయంకర దృశ్యం
ఈవల చీకటితటిలో
దావానల దీప్తిలోవ్యథలనైరాశ్యం

ఆయెడ బాధలసంపుటి
మాయని వలపులవిరిసిన మధురస్వాంతం
ఈయెడ గుండెల కుంపటి
తీయని తలపుల ముసరిన దీర్ఘధ్వాంతం

అటు చూస్తే అటుకాంతికి
చటుల జ్వాలాప్రభూతసంధ్యావరణం
ఇటుచూస్తే యిటు శాంతికి
జటిలక్ష్వేళాప్రణీత ఝంఝా వరణం

మదిలో చీకటి పొదలో
నిదురిస్తూ కలల తూలి నే నొక్కణ్ణే
హృదిలో చీకటిరొదలో
నిదురిస్తూ కడల తేలి నే నొక్కణ్ణే!

– కవిత: 1954



మసక సంజ పరచు ముసుగు
పసిడి కలల కునుకు నిసుగు
వెలితి కనని వలపు పంట తల్లీ!
విడని కనుల కదుపుమంట తల్లీ!

బ్రతుకు వేడు తీయదనము
బెదరి చెదరు నిండు మనము
తగని రక్త గంధమమ్మ!
తెగని రాగ బంధ మమ్మ

– 1955
ముక్తయాత్ర



తలుపు తెరచి యెవ్వరిదే
పలుకరింత పదే పదే!
ఎవరి కోసరమయి వచ్చె
పవలుచింది కారు నలుపు?

– 1955
ముక్తయాత్ర



ఏమన్నది, ఏమన్నది
దిగులు పడని దిగుడు బావి
ఏమన్నది, ఏమన్నది
రగిలి పగిలి కాళరాత్రి
ఏమన్నది, ఏమన్నది
చెమ్మగిలిన తుమ్మ పుంత
ఏమన్నది, ఏమన్నది
పిట్టి యెడద జేగురింత

– 1955
ముక్తయాత్ర



విరియ విరిసిన
విరుల గుబురుల
హోరు గాలి
కలల కురిసిన
వలపు లెవరివి
తోట మాలి!

– 1955
ముక్తయాత్ర



ఎవరి కెవరు పవలురేలు
ఇవలికవలి కింతెచాలు
వెలితి కనని వలపు పంట తల్లీ!
విడని కనుల కడుపుపంట తల్లీ!

– 1955
ముక్తయాత్ర

## అన్నా

అర్థ రహితపు టావేశాల చిట్టడవి
అన్నా! అందు నువ్వొక్కడివి
ఎండమావికి మ్రొక్కుబడివి
మండుతున్న గుండెల తీరుబడివి

శని దేవత హసితాధర కాంతి
శాశ్వత మందున్నది శాంతి
వలపన్నిన యీ అకాల భ్రాంతి
పరమార్థం విరమనః ప్రశాంతి

ఈకాల మొక్క గుండె చెరువు
ఈ రోజున కన్నీళ్ల కరువు
అన్నా! ఏమున్న దింక తెరువు
అవధి యెరుగదు బ్రతుకు బరువు

జైత్రయాత్రలో గావురు మన్నకేక
చైతన్య స్రవంతిలో భగ్నజీవన నౌక
అన్నా! ఆప్తదీప్తవదనం లేక
ఆశింతువీ చీకటి సదనమెందాక?

అర్ధ రాత్రపు టావేశాల చిట్టడవి
అన్నా! అందునువ్వొక్కడివి
కవితావధూటి కంటి తడివి
కాలం వెలిగించుకున్న కొడివి!

– తెలుగు స్వతంత్ర
ఏప్రిల్ 15, 1955

# పిలుపు

గుండెతెరచి కోర్కెపరచి
ఎవ్వరినేరేయి పిలుచు?
మూలమూల నేలనేల
ఎవ్వరికే వేయి కనులు?

గాలిసాగి ధూళిరేగి
వెరపుగొలుపు నలుపు విరిసె
తేలి తేలి మేఘమాల
దిక్కులేక నేలరాలె!

నాలోపల నీ కేకల
కే చీకటి పలుకునపుడు?
నీకైనా నాకైనా
జాడలేని వీడుకొలుపు!

– 1956

# దీపావళి

ఇది వెలుగుదినం, చీకటి బెదరి చెదరు
ఇది తెలుగుజనం; ముక్కోటి మెదల మెరుపు!
ఇది ప్రదీప్త సాయంతనం, వదల కాంతి
ఇది శుభోత్సవ దర్శనం, ఎగయు శాంతి!

దీపం తల్లీ!
దీపం తల్లీ!
సంజప్రొద్దు విరిసెనమ్మా!

గడప గడప ప్రమిదలార్చి
పసిడి రంగు పడగలెత్తి
నలుపు చింపి వెలుగు నించి
కునుకు మనికి మేలుకొలుపు

వెలిగించవె తల్లి వెలిగించవమ్మ
ప్రతియింట ప్రతిగుండె పసిడి దీపమ్ము
నేడె దీపావళి, నేడె మా తల్లి
నిఖిల జనగళనిగళ నిర్దళన మమ్మ!

దీపం తల్లీ!
దీపం తల్లీ!

వెలిగించవే తల్లి వెలిగించవమ్మ
విడివడని గడె తెరచి గుడిలోన తల్లి
వెలుగులో దైవమ్ము విచలించిపోవ
దేదీప్యమానమ్ము దివ్యదీపమ్ము!

సడి లేక నడి రేయి గుడిసెలో కునుకు
తడిలేని బడుగు పేదల కనుల లోన
వెలిగించవే తల్లి వెలిగించవమ్మ
ఆశాద్యుతుల తల్లి ఆశాశలల్లి!

కడలేని బ్రతుకుటాకలి తీరిపోవ
కలలోని గాలిమేడల నలుపు మాయ
వెలిగించవే తల్లి వెలిగించవమ్మ
నేడె దీపావళి! నేడె మాతల్లి!

– వనిత
నవంబరు 1956

## అన్నా!

అన్నా! నువ్వెవరవో నాకు తెలీదు
ఐనా పలకరిస్తున్నాను
పదే పదే పరీక్షిస్తున్నాను
పంచప్రాణాల కెంత ఖరీదు?

ఆవలి తీరంలో అలా నిలబడి
దోవతప్పిన నేస్తం!
ఎంత భయానకం సమస్తం
ఎలా వచ్చింది నీకీ తీరుబడి?

ఈ లోకం మీద నాకూ ద్వేషం
ఈ బ్రతుకంతా చేదు
నిస్పృహకు స్పృహరాదు
నీదీ నాదీ అనాది నుంచీ పగటి వేషం!

విను విను విను చెపుతున్నాను
వెళ్లిపో కొంపకి
గులాబీవంటి చెంపకి
కోరికల ముళ్ల కంపకి!

అక్కడ కనిపిస్తుంది
అంతా పచ్చదనం
అక్కడక్కడ వెచ్చదనం
అందులో బతుకు పచ్చిదనం.

అన్నట్టు మరిచిపోయాను
కన్నతల్లి తప్ప నీకెవరూలేరు
ఓదార్చే చెల్లెళ్లు తప్ప నీకెవరూ లేరు
ఊకొట్టే గుండెతప్ప నీకెవరూ లేరు

– 1958

# రాక్షస గీతం

ద్వార బంధాల తెరలకువిచ్చిళ్లు సవరించి
రాగబంధాల మరుల వువ్విళ్లు వివరించి
ఇది గాదిలోంచి తీసిన ఉగాది
ఇది ఖాదీ మాతపల్లవ ఖాది

మేజు వాణుల బూటా సభలందు దులిపించి
రోజురోజుకి పొగరు కుంచాల కొలిపించి
ఇది పండి రాలని బండి బూల మొండుగ
ఇది చండ ప్రచండ మైన శుద్ధదండుగ!

మంచి రోజుల గాజు కనుల వరియించి
మించిపోయిన రోజు కొరకు జనుల కబళించి
ఇది తొండ ఊసర వెల్లి యైన పండుగ
ఇదికుండనిండిన కదలని దండగ!

కంచి దారి తప్పిన పదుపు కథల చెప్పించి
కల్ల ముంతల ప్రజల కాకలి దప్పుల తప్పించి
ఇది సోదిముల్లెనించి దిగిన ఉగాది
వాత పెట్టుకున్న సామ్యవేది!

– ఆంధ్ర జ్యోతి
**18.4.1975**

# ఉత్తర ఖండం

ఆశలేవివ్వుడుంచని శైశవాన
అక్షరాభ్యాస బాధామహోబ్ధిలోన
కాలిడిన యంత నీవె నాకంటబడితి
వావిశాఖనగరవీథులందు మొదల!

నన్ను జూచిన యంత నీ కన్ను లెంత
విరిసి పోయిన వోనాడు విదితమయ్యె
లోన నీలోని నిద్రాణ వాణి నీకు
తెలియరాక మేల్కొని నన్ను పలుకరించె!

నాడు నీ వెరుంగవు విశ్వనాథ శాస్త్రి!
నేనెరుఁగుదు నీవర్ధమాన పథము
తెలుఁగు సాహితీ జగతి ప్రదీప్తమవును
నీ వలన ముందు కాలాన నీ కలాన!

నేటి తెలుగు సాహిత్య వాణిజ్య వీథి
కేవలనిరక్షరాస్యులు, కృతకవేత్త
లెంత పెత్తనమ్మును చలాయింపగలరొ
నాడెపుడయిన తలపోసి నామ మనము?

స్వీయ కృతినొక దాని చే ధరించి
పదవులకయి నానా మంత్రిపదము లంటు
పద్యకర్తలు సాహిత్యవర్తకులును
వేనవేలు త్రిలింగదేశాన నేడు!

మున్నె ప్రవచించె నందరి కన్న మాన్య
డాద్యుడు పరమ పూజ్యుడారాధ్య సుకవి
అద్యతన కవితామ్నాయ సద్యశస్వి
విశ్వసూక్తిగ తిరుపతి వేంకటకవి

''కవిత వలన పున్నెము గూడగలిగెనేని
కలుగ నిండ్రాపశక్యమ్ముగాదు; రామ
కోటివలె నుండు రచనలు కోవిదులకు
నచ్చు నీరహస్యమ్మువిన్నాణి యెరుగు''

మనది గాంగేయ వంశమ్ము కనుక మనకు
కలరు దాయాదులెందరో కవులు కళకు
లందు శిష్ట్లా ఉమా మహోవందితుండు
కడకు శ్రీ శ్రీ, తదుపరి వగ్నముషి కలదు.

తనకు తానై అజంతా యథార్థ మెరిగి
అతివిశిష్ట మార్గస్రష్టయయ్యె; ముక్త
కవిత కాతడెయుగకర్త కలుగుగాక
అతని కవితాత్మకే నాటికైన శాంతి!

కీర్తిశేషుడు శ్రీరామ కృష్ణ శాస్త్రి
నర్మపదవేత్త రుక్మిణీ నాథ శాస్త్రి
నాకువిననాటి నేస్తు లేనాటికైన
అమర జీవులు మన వాఙ్మయమ్మునందు

దైవమన్న నమ్మినవాడు తానెదైవ
మన్నవాడును పోయిరి నిన్న మొన్న
మరియు నన్నయ పోయె వేమన్న పోయె
చాలు! మనకేల వ్యర్థ విచార మిపుడు?

దేహ యాత్రయే నేడు సందేహమయ్యె
దేశమెల్ల రాజక బహిర్దేశమయ్యె
ప్రస్తుతాంధ్ర సారస్వత రంగమందు
వందిమాగధులే పేరు పొందగలరు!

అలవిశాఖపురీ సాగరాంబు తప్త
సైకతమ్ముల బహుదిన సాంధ్యవేళ
కలువరింతల మనసార కట్టుకొన్న
గాలిమేడలే మనకు దిక్కయ్యె నేడు!

ఎక్కడేని. ఆశాద్యుతి యింత విరియు
నేని మన జీవితమ్ముల కెంత తృప్తి?
ఆ తరుణగవేషణమే యీ యావదాంధ్ర
మందు సత్కళా నిష్ణాతులాశ పడగ!

– ఆంధ్రజ్యోతి
22.12.78

# చెలీ, నెచ్చెలీ!

ఇది వ్యాపారం, వ్యామోహం నగరం
నిష్ఫలం మన జీవిత సంగరం
వెళిపోదాం పద ప్రేయసి!
వెదుకుతున్నది మనకోసం రోదసి

ఒకసారి మనమూ కలగాశాం
ఉజ్వల స్వర్గాన్ని తలపోశాం
ఇక లాభం లవం లేదు చెలి!
ఎవరు తీరుస్తారు మన ఆకలి!

రహదారి మీద నడుస్తున్నాను
రహస్యాను గుండెల్లో ముడుస్తున్నాను
ఒక చీమకయినా కనికరం లేదు ప్రేయసి!
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి!

చిత్రిస్తున్నది మన భవిష్యత్తును లోకసభ
అయిదయిదేళ్లకు ఆవిష్కృతం జనప్రభ
అది చూసేందుకు కావాలంది ప్రవేశపత్రం
గేటు దగ్గరి ద్వారపాలక గాత్రం!

దూరంగా సమ్మర్దం, నినాదాలగోల
ఆ మధ్య చేరికూచున్నా నొక మూల
చెలీ! మనగురించి మాట్లాడుతున్నారు
మన పేరుతో కాట్లాడుకుంటున్నారు

పడుకునేందుకు చోటు లేదు పార్కు తప్ప
వెళ్లి పొమ్మన్నాడు కాపలావాడు తాగితప్ప
సగం రాత్రి చీకటిని కావలించుకున్నాను
చెలీ! చలితో నిద్రని పంచుకున్నాను.

అధికార్ని అర్థించాను ఉద్యోగం కోసం
ఆయనకు తీరికన్నాలేదు వినేందుకు కనీసం
ఇవాళెలా గడుస్తుంది చెలి?
ఎవరున్నారు మనకీ భూస్థలి?

మొన్ననే యేర్పడింది మన ప్రభుత్వం
దానిప్రాతిపదిక సమత్వం
ప్రజాధనంతో ప్రజాసేవ చేస్తుంది
అందరికీ ఆనందం చేకూరుస్తుంది!

పరిగెత్తాను రైలు బండీ యెక్కేందుకు
పరలోకానికి టిక్కెట్టు కొనుక్కునేందుకు
రైలంతా నిర్జనంగా ఉంది
ప్రయాణం దుర్భరమనిపించింది!

– ఆంధ్రజ్యోతి
23.3.1979

# అంత్యక్రియలు

మంటి కాలినా మంటి కలిసినా ఒకటేనంటి
మృత్యువన్నదే సత్యమన్న మాట వింటి
పరలోక మన్నది కలదన్న చెవులు మూసికొంటి
విరక్తిం మీ జీవితమ్ము చాలు ననుకొంటి!

పాలముంచినా నీట ముంచినా నీవేనంటి
పాపమన్నది పుణ్యమన్నది కలదా యంటి
యమలోకము కలదన్న నోరుమూసికొంటి
యథార్థ మీ బతుకన్న మేలు కొంటి!

రేపుమాపైన మాపురేపైన చాలుననుకొంటి
రెక్కలేని దిక్కులేని పులుగు కంటి!
చావుబ్రతుకులు విధిలోన వింటి
చాలు చాలు మోన బోతినంటి!

రణమన్న మరణమన్న భయపడనంటే
క్షణమన్న నిత్యము సత్యమనుకొంటే
ఏమన్న కాదన్నదేదో తెలిసికొంటే
వెలుగన్నది కలదన్న తెలియనంటే

మొలమన్నది భూతల స్వర్గమను కోట
కలగన్నది కల్లగాదు నేనను గొన్నదంటే
వెలయాలు మది వెల తేసి దంటే
తెలవారినంత కోవెల పోవడమంటే!

— [illegible]
12.1.1979

## ఖః శ్రీనీసోలు

1

నీవైన నేనైన నీలోన నాలోన
        గాలివీచిన యంత కదలి మెదలి
ఈ కళేబరమెల్ల యింత కాంతి వహించి
        బ్రతుకయి ఆనంద భాసురమయి
కష్టభాజనమయి కాలబద్ధమవును
        పంచభూతావృత భావమవును
అందుకోసరమని అందాలకోవ! నీ
        కనులెంత నెత్తురు కదిపికొన్న
కలవొకటె జన్మకు వరము గమ్యరేఖ
విప్పి చెప్పుకోలేని నీ పృథులవేధ
నేనెరుంగుదు, వ్యర్థము నేటి దనుక
జీవితమ్మని తలచివాపోవ వలదు

2

ప్రతి దివసాంతమ్ము స్మృతిపథాంచల చంచ
        లచ్ఛాయ కాలఖిలమ్ములైన
కోరికలొకచోట గుమిగూడి నావంక
        యేతజ్జనన మూల హేతువైన
నాజన్మవంక దైన్యాతిదైన్యమ్ముగ
        బెదరు గుండెల జూచి వెదరి పోవు
ఆపైన నాలోన నాపురాకృత భావ
        నా వైభవ మొకమందార మట్లు
పూచి పూచినంతనె వాడిపోయి నాజ
గత్తు గండకత్తెరపోతె కనుల నావ
లించినంతన వెలిని, వార్ధిధుల, శూన్య
గగనవీథుల దేనికోకలయు జూతు!

3

మధువాని వ్యథలెల్ల మరచిపోజాము నా
        పంటనీవంటి విఫలమనోర
థుల మధురాతి మధుర గీతి వినసహి
        యింపజాలక గొంతుచింపుకొన్న
దోగ్ధులు కొందరు దొంగలున్నారు జా
        గ్రత! భావదారిద్ర్య కారణమున

ప్రథమసమాగమ మధుర క్షణములవి
మరచిపోలేనిదా మౌనరాత్రి
నగ్నవు నీవు, ఉన్మత్త శరీరమ్ము
నాది, నాలోని సంధ్యాపరిధుల
దాటి, నీలోని గాంధర్వమ్ము రేకెత్తి
చీకటి చాయలో చిక్కువిడని
రక్తపరీమళ రాగ రహస్యమ్ము
పంచుకొన్నది మన మంచు బ్రతుకున
తెల్ల వారిన యంత సందేహవీధి
తిరిగి తిరిగి చీకటికయి తిరిగె మెత్తి
మరలి వత్తును నీకైన మనసు పిలిచి
చెలియ! నీవె నా పరమార్థ సీమసుమ!

6

కలగాయనిది మనుగడయె కాదంటివిని
నమ్మవైతివినాడు నమ్మవిపుడు
యాదృచ్ఛికమ్మిది యావత్ప్రపంచక
ప్రాణికోటియు క్షణభంగురమ్ము
ఏనాటికేని నాయీ శరీరమ్ము కా
లక్రమమ్మున మృత్యులక్ష్యమవును
నీవును పోవలె నేనును పోవలె
కాన వ్యవధి క్షణికముగ దోచి
నీమనోరథపథమహాన్వేషణమున
ఇన్ని నాళ్లుగ బ్రతికి, మరెన్ని నాళ్లు
బ్రతుకగలనో తెలిసి కల చితుల వెదకి
నిను వివస్త్ర చేయుదు నీవె నిత్యమనకు

– ఆంధ్రజ్యోతి
నవంబరు, 1982

# చేదుపాట

ఇది ఉగాది దగాది
ఈపూట మాపాట
ఎన్నడో పాడినది
ఎప్పుడూ వాడనిది

ఈ ఉగాది దగాది
ఏడవకు నాతండ్రి
ఏడిస్తె నీకళ్లు
ఎవరోయి తుడిచేది?

ఇది ఉగాది దగాది
ఈనాటి మానాదు
ఎన్నడో గిట్టినది
ఎవరికీ పట్టనిది

ఇది ఉగాది దగాది
ఈరోజు మా రాజు
ఎవరనీ చెప్పేది
ఏమనీ యేడ్చేది

ఈ ఉగాది దగాది
ఈ రోజు రేపైన
మాపైన పోయేన
మంచికే వచ్చేన?

– ఆంధ్రజ్యోతి
రుధిరోద్గారి, 1983

సంతృప్తి ఉండేది మాకు. శ్రీశ్రీ తలపెట్టిన కావ్యానికి 'కలకాలం' అనిపేరు పెట్టాడని చెప్పానుకదూ - అందులో ప్రధానవృత్తం - యీలోకమూ, యీ జీవితమూ అంతా ఒక కలగా ప్రారంభమయి కలగా అంతమవుతుందని. నేను తీసుకున్న యితివృత్తంలో - యీప్రపంచం ఓ రకమయిన కారాగారం అందులో మనం జీవితాంతం బంధితులుగానే ఉంటాం అని. తరవాత 'చెరకాలం' కోసం ఉపోద్ఘాతం రాస్తూ...

కలకాలం చెరకాలం
సిలువై తుదికావ్యమై స్ఫురించెను వరవా!

అన్నాడు. ఇంతకీ జరిగిన విషాదకరమయిన వ్యవహారమేమిటంటే - నా 'చెరకాలం' వ్రాత ప్రతిని తనతో పాటు తీసుకుపోయి యెక్కడో పోగొట్టుకున్నాడు. నాదగ్గిర మరోప్రతిలేదు! ఒకసారి అందులోకొన్ని ఖండికలు 'తెలుగు స్వతంత్ర'లో గోరాశాస్త్రి ప్రచురించాడు (13.5.1949). శ్రీశ్రీ 'కలకాలం' అనే శీర్షికతో ఓ ఖండిక రాశాడు. అంతే, ఆకావ్యాన్ని అనుకున్నట్టు రాయలేదు. తరవాత మిత్రుల ప్రోత్సాహమ్మీద నాదగ్గర యిక్కడా అక్కడా కాగితాల్లో, నోటు బుక్కుల్లో దొరికిన వాటితో 'అందాక' అనేపేరుతో ఓ సంకలనం వెలువడింది. అది అచ్చవుతున్నప్పుడు శ్రీశ్రీ హైదరాబాదు నుంచి అనే ఉపోద్ఘాతం రాయల్లని నాలుగు పద్యాలూ రాశాడు. 'అందాక' మరోరెండు సార్లు అనతికాలంలో ముద్రణ భాగ్యం పొందింది.

మిత్రులు తిరిగీ 'చెరకాలం' రాయమని పదేపదే అడుగుతూవున్నారు. నాకలా మనస్కరించలేదు. ఎందుకంటే అది రాసినప్పుడు వ్యక్తివేరు. - అంతే కాకుండా 'చెరకాలం'లో మరోప్రయోగం చేశాను. చాలావరకు సాంప్రదాయిక ఛందస్సును వాడాను. స్రగ్ధర, భుజంగ ప్రయాతం, గీతం, కందం, చంపకమాల - అన్నీ వాడాను. అందులో చాలావరకు వ్యవహారిక భాషలో రాశాను. తతిమ్మావి చాలావరకు మాత్రా ఛందస్సులు, కొన్ని ముత్యాలసరాలు. ఆ తరవాత ఓసారి విశ్వనాథ సత్యనారాయణగారు నాతో అన్నారు: ''నీ స్నేహితులంతా ఛందస్సు మీద విరుచుకు పడతారేం? వాళ్లకి చాతకావాలి కాని అందులో రాయటానికేంబాధ? నువ్వు రాసి చూపించావుకదా - యింకా యేంకావాలి వాళ్లకి ?'' అంటూ అలాగే కృష్ణశాస్త్రిగారూ అభినందించారు. ఇలా ప్రయోగాలు చేస్తూ - కొంచెం తృప్తి కొంచెం అసంతృప్తీనూ - రాసిన

కావ్యం అది. అంచాత మళ్లీ తిరిగి రాయటానికి మనస్సు ఒప్పుకోలేదు. మరోటి రాయాలనుకున్నాను. 'సామిధేని' అని ప్రారంభించి కొంత తెలుగు స్వతంత్రలో వచ్చింది – స్థానచలనం వలన – నేను హైదరాబాదు వదిలేసి ఢిల్లీ వెళ్లి పోయాను – అదీ అసంపూర్ణంగానే మిగిలిపోయింది.

*ప్రభాకర్: ఈనాటి కవుల్లో కొందరు ఛందస్సన్నది కాలానుగతమయిన వేగానికి అనుబంధిత మయిందంటారు. రథాలూ, పల్లకీలూ, గుర్రబ్బళ్లూ వెళ్లేదారిని తప్పి, ఏ మోటార్లూ, రైళ్లూ తిరిగే ఆధునిక యుగానికి తెలుగు కవిత్వాన్ని మళ్లించాడు గురజాడ – ఆ దారిని మేము మరింత సుగమం చేసుకున్నామంటారు.*

వ.రా: మొదట శ్రీరంగం శ్రీనివాసరావు యీ ప్రతిపాదన చేశాడు. ఇప్పుడు మనం చూస్తున్న వేగ వైపరీత్యం ప్రకృతిలోనే ఉంది. వెలుగు ప్రయాణం వేగం యెంత? ఉపోసు వేగం యెంత? ఉప్పొంగే వరద వేగం యెంత? అనాది నుంచీ కవులు అలాంటి శబ్దవేగ ప్రాబల్యానికి సుపరిచితులే. అందులో సందేహం లేదు. పద్యం నడకలో, వస్తు కల్పనా వైచిత్రిలో, భాషా శైలిలో మనం చూడవచ్చును. ''కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి గగన భాగం బెల్ల కప్పికొనగ'' అన్నారు పోతనగారు. అదే ఆధునికత! ఆనాడూ, యీనాడూ అలాంటి వాటిల్లో మార్పు ఉండదు. ఛందస్సూ అంతే.

*ప్రభాకర్: కొందరు ఛందస్సుతో సంబంధం లేకుండా కవిత్వం రాయాలంటున్నారు కదా?*

వ.రా: ఛందస్సంటే ఏమిటో తెలియక. అదీకాక కవిత్వానికి అత్యంత ప్రాణప్రదమయినది ఛందస్సు. ఛందస్సు లేకుండా కవిత్వం లేదు. ఛందస్సంటే కట్టుబాటు. ఒక కూర్పు. ఒక యేర్పాటు. నియమబద్ధం. పదాలు కానీ, వాక్యాలుకానీ కవిత్వంగా మారినప్పుడు నియమబద్ధ మవుతయి. నియమబద్ధమయినది లయబద్ధమవుతుంది. అలాంటిదే కవిత్వం. అది టెక్నిక్‌కు సంబంధించినది. అప్పుడు కవిత్వం 'రసనాగ్ర నర్తకి' కావటానికి అనుకూలిస్తుంది. పూర్వకాలంలోనే ఛందస్సు అనేకాలు. అంచాతనే 'అనంతావైఛందా' అన్నారు. అందులోని అనంతభావాన్ని యేమరచి అసలే వద్దనటం

అయోమయాన్నే సూచిస్తుంది.

అదీకాక ప్రకృతి అంతా ఛందోమయం. ప్రకృతిలోని ప్రతి అంశానికీ ఒక క్రమం ఉంటుంది. ప్రకృతి ప్రతిబింబమే ఛందస్సు. ప్రకృతికి ప్రతిస్పందన కవిత్వం అనుకుంటాను. కవిలో అంతఃస్ఫూర్తిగా ఆవిర్భవించినప్పుడు కవిత్వం రూపొందుతుందని యేట్సు అన్నాడు. ఒకసారి ప్రకృతిని చూడండి. ఋతువులూ, ఉదయాస్తమానాలూ, భూభ్రమణం, గ్రహగానాలూ – అన్నీ నియమబద్ధంగా ఉంటాయి. అలాగే బండి నడుస్తున్నప్పుడు చక్రభ్రమణ, గుర్రాల డెక్కల చప్పుళ్ళూ ఒక నియమ ప్రకారం వింటాము. మానవ శరీరంలో హృదయ రక్తప్రసారమూ, శ్వాసనిశ్వాసలూ ఒక నిర్దిష్ట స్థితిలో ఉంటాయి. దానినే ఛందస్సంటాము. ఛందస్సు లేనిదే సృష్టి లేదు. ఛందస్సు లేనిదే ప్రాణం లేదు. ఛందస్సు లేనిదే గానం లేదు, కవిత్వం లేదు. ఈ విషయంలో వాదవివాదం అనవసరమనుకుంటాను. ఛందస్సు యేరకంగా రూపొందినా అది సహజమైన అంశం అని నా ఉద్దేశం.

*ప్రభాకర్: సాహిత్యంలో ఇలా మధ్య మధ్య ఉద్యమాలు ఎందుకు వస్తూ ఉంటాయి? వాటి మీద మీ అభిప్రాయం చెబుతారా?*

వ.రా: సాహిత్యంలో ఉద్యమాలకి ఆస్కారం లేదు. ఉద్యమ పరిధిలో సాహిత్యాన్ని నిక్షేపిస్తే అది సంకుచితమై అర్థరహితమవుతుంది. చరిత్రలో అనేక విధాల ఉద్యమాలు రావటం మనకు తెలుసు. కాని కాలంలోనే అవి అంతర్ధానమయి పోయినాయి. సాహిత్యమే నిలుస్తుంది. కవిత్వమే అనేక కాలాల పాటు నిలుస్తుంది. ఉద్యమపరంగా వచ్చిన సాహిత్యం తాత్కాలికమే.

*ప్రభాకర్: 'వచన కవిత్వం' గురించి మీరేమంటారు?*

వ.రా: ఆ ప్రక్రియ మనం విదేశాలనుంచి దిగుమతి చేసుకున్నది. దాని లక్షణాలు పట్టించుకోకుండా రాస్తున్నారు. అదే తప్పు. ఈ ప్రక్రియను శ్రీశ్రీ తనకు దక్కవలసిన ప్రఖ్యాతి వచ్చిన తరువాత చేపట్టాడు. అతనితో పాటు నేనూ, కుందుర్తీ, ఏల్చూరీ, ఆరుద్రా, రామదాసూ, తిలకూ, రాజేశ్వరూ కలిసి ఆ ప్రక్రియ ప్రచారానికి ప్రయత్నించాం. రామదాసూ, తిలకూ, నేనూ ఆ ప్రక్రియను సవ్యంగా సాధించలేమనీ, దానికి భవిష్యత్తు అనుమానాస్పదమని

తలచి వదిలేశాం. ఆ తరవాత వాళ్లిద్దరూ దివంగతులయారు. శ్రీశ్రీకి రావలసిన ప్రఖ్యాతి మాత్రం ఛందస్సు వల్లనే వచ్చింది. మన పూర్వీకులు కూడా 'వచనాలు' రాసేవారని తరవాత తరవాత కొంతమంది చెబుతూ వచ్చారు. అయితే ఆ వచనాలకు లక్షణం ఉంది. అయినా వాటికి ప్రాముఖ్యం రాలేదు. అనుభవం అలా వుంటే యీనాటి 'వచన కవిత్వం' సంగతి ఊహించటం అంత కష్టం కాదు. ఈనాడు 'వచన కవిత్వం'లో కేవలం వచనమే కనిపిస్తోంది. నా మట్టుకు నేను ఆ ప్రక్రియలో కృతకృత్యుణ్ణి కాలేకపోయానని నమ్ముతు న్నాను.

*ప్రభాకర్: మీరు ప్రతిపాదించిన లక్షణాలకి అనుగుణంగానే మీరు కవిత్వం రాశారా?*

వ.రా: అలాగని నేననుకోను. కవిత్వం మీదా, సాహిత్యం మీదా నా అభిప్రాయాలు నాకున్నవి. అవే నిజం అనే అభిప్రాయం కూడా నాకున్నది. ఆ అభిప్రాయాలు నా మనస్సులో ఉండగా కవిత్వంలో ప్రయోగాలు చేశాను. కొన్నిట్లో పరిపూర్ణంగా కృతకృత్యుణ్ణయాననే విశ్వాసం నాకుంది. ఇంతకీ నేను రాసింది చాలా తక్కువ. అందులో అభ్యాసమయేవి మరీ తక్కువ. ఆ అల్పసంఖ్యలోనే అనేకానేక ప్రయోగాలు చేశాను.

*ప్రభాకర్: సాంప్రదాయిక ఛందస్సును యెందుకు వాడారు?*

వ.రా: అందుకో కారణం ఉంది. గురజాడ అప్పారావు గారు ముత్యాలసరాలు – ఇదీ ఒక విధంగా సాంప్రదాయిక ఛందస్సే – అప్పారావుగారా పేరు పెట్టటంలో కొత్తదనం వచ్చింది. కొన్నిటిని శిష్టవ్యావహారికంలో రాశారు. ఆయన అభిమానులు – ఆనాటి నవ్యకవుల్లో చాలామంది ఆ ఛందస్సును వాడారు. ఒక విశ్వనాథ సత్యనారాయణగారు తప్ప తక్కిన వారంతా గ్రాంథికంలో ఆ ఛందస్సును వాడారు. అప్పారావుగారు కూడా తాము కవితల్లో సగం భాగం పైనే సరళగ్రాంథికంలో రాశారని మనకు తెలుసు. అందువల్ల వ్యవహారిక భాష సాంప్రదాయిక ఛందస్సు రెండింటను కూలించకూడదూ అని నేను ప్రయోగం చేశాను.

ప్రభాకర్: కవిత్వం అంటే యేమిటో చెప్పగలరా?

వ.రా: ఆ ప్రశ్నే తప్పు. రుచిని యెలా నిర్వచించగలం? పరిమళాన్ని యెలా నిర్వచించగలం? అనుభూతిమీదే తెలియాలి. శకుంతలగాథలో నన్నయగారి పద్యం చదవండి:

విపరీత ప్రతిభాషలేమిటికి
నుర్వీనాథ యీ పుత్రుగా
త్ర పరిష్వంగ సుఖంబు నేకొనుము
ముక్తాహార కర్పూరసాం
ద్రపరాగ ప్రసరంబు జందనము
జంద్ర జ్యోత్స్నయుం బుత్రగా
త్ర పరిష్వంగమునట్లు జీవులకు
హృద్యంబే కడున్ శీతమే.

కవిత్వం అంటే అది. అలాగే మరో ఉదాహరణ చెబుతాను. శ్రీరంగం శ్రీనివాసరావు 'సుప్తాస్థికలు' అనే ఓ గీతం రాశాడు. అందులో అంతా కవిత్వమే. చివరి పద్యం:

నా కనుంగవ కన్నీళ్లురెండు
నవి యొనర్చెడు నీరవాహ్వాన మెరిగి
ఇంతశోషిల్లునేలొ నాహృదయపుటము-
వణకునేటికొనా అస్థిపంజరమ్ము!

ఇదీ కవిత్వం! ఇలాగ యెన్నైయినా చూపించగలను. ఆలంకారికంగా రసానుభూతి వైయక్తికం. ఒకరికి నచ్చింది మరొకరికి నచ్చకపోవచ్చును. తప్పులేదు. అయితే కవిత్వానికీ వచనానికీ మధ్యగల భేదాన్ని సరిగా అర్థం చేసుకోవాలి.

*(వరద రాజేశ్వరరావుగారితో వరకాల ప్రభాకర్ జరిపిన ఇంటర్వ్యూలో కొన్నిభాగాలు..)*